దేశ ప్రచురణ
ప్రథమ ముద్రణ
మార్చి 1952
కిసాన్ ప్రెస్
విజయవాడ-2
రూపాయి పావలా



సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

## అంకితం

నిత్యజీవితంలో ఏ అనుభవంతోనూ తృప్తిపొందక ఏవో పగటి కలలు కంటూ తిరిగి యధార్థ దృశ్యాలకు అలవాటుపడిన మధ్యతరగతి సోదరులకు.

## పాత్రలు.



| | |
|---|---|
| గోపాలం : | గుమాస్తా |
| సినిమా డైరెక్టరు : | |
| సినిమా ప్రొడ్యూసరు : | |
| ఏజెంటు : | సబ్బుబిళ్ళల కంపెనీ ఏజెంటు |
| హనుమాన్లు : | వినీ పత్రికా సంపాదకుడు |
| డాక్టరు : | |
| మేనేజరు : | |
| గురువులు : | నౌకరు |
| అబ్బాయి : | గోపాలంకొడుకు |
| విద్యుల్లత : విద్యాదేవి లత | స్వప్నసుందరులు |
| సుబ్బులక్ష్మి : | గోపాలంభార్య |

ప్రదర్శన సౌలభ్యానికి ఈ నాలుగు పాత్రలూ ఒకరే వెయ్యవచ్చు.

ఈ నాటకము 23-11-50 అరుణోదయ నాట్యమండలి పంచమవార్షికోత్సవ సందర్భంలో ప్రదర్శించినప్పుడు నటవర్గం:

గోపాలం : K. V. S. శర్మ
డైరెక్టరు : Ch. హరినారాయణ
ప్రొడ్యూసరు: రామచంద్రరావు
ఏజంటు } సీతంరాజు
హాసుమాస్టు }
డాక్టరు: కృష్ణారావు
మానేజరు : B. N. సూరి
గురువులు : వసంత కుమార్
అబ్బాయి : మాస్టర్ వింజమూరి
విద్యుల్లత : శ్రీమతి R. నిర్మల
సుబ్బులక్ష్మి : " సుశీల

మ్యూజిక్: రత్నారావు అండు పార్టీ,
నేపథ్యగానం: రాజు. అమ్మడి. పార్వతి

ప్రొడ్యూసరు:
యస్. కనకారావు.

ఈ నాటకం ప్రదర్శించటానికి దేశికవితామండలి, విజయవాడవారి లిఖిత పూర్వకమైన అనుమతి పొందాలి.



# తీరని కోరికలు

## ఒకటవ రంగం.

జీవితము స్వప్నమ్మురా
భావితార్థము బడయజాలని బ్రతుకు శ్రమ వ్యర్థమ్మురా॥
ఏవిధపు అనుభవముగానీ, భావితిమిరములోని కీడ్వగ
త్రోవ తెలియని అంధకారపునావలో తలక్రిందు లేద్పులు॥
మధురమధురానుభవముల మైమరచిపోయినమరుక్షణమ్మున
విధురజీవిత వేదనలతో విసివి భయపడి మేలుకొందువు॥
మనసుతీరిన సుఖములైతే మరీమరీ యని కలవరింతువు
జాలికూర్చిన కష్టమైతే చాలులేయని ఉలికిపడెదవు.

[గుమాస్తా గోపాలం యింటిలో పడకగది. ప్రక్కగా వేసిన మంచంమీద గోపాలం పడుకుని వుంటాడు. ఒంటినిండా పెద్ద రగు కప్పుకుని వుండటంచేత పైకి ముఖంమాత్రం కనిపిస్తూ వుంటుంది. మంచానికి చేరువగా ఒక చిన్న బల్ల. దానిపైన మందుగ్లాసులు. దూరంగా ఒక ట్రంకూ, దానిపైన మాసిన రంగు చీరలు. ప్రక్కగా మరొక చిన్న కుర్చీమీద గోపాలంభార్య సుబ్బలక్ష్మి కూర్చుని అతని తల వత్తుతూవుంటుంది. దూరంగా గడియారం 8 గంటలు కొట్టుంది.]

గోపాలం : ఎనిమిది గంటలయింది. ఇంకా పేపరురాలేదు కదూ?

సుబ్బలక్ష్మి : అబ్బాయి వెళ్లాడు; పేపరుకూడ తెస్తాడు బన్‌తోపాటు; అయినా యీ జ్వరంలో ఏం చదుతారు పడుకోండి. యీ జబ్బుకి పూర్తివిశ్రాంతి మంచిదన్నారు డాక్టరుగారు.

గోపా : విశ్రాంతి...పూర్తి విశ్రాంతే తీసుకుంటానులే!

సుబ్బ : ఆవేంమాటలండీ అలాగంటారు శుభం మల్లే!

గోపా : అలాగనక యింకెలాగు అనమంటావు. గుమాస్తా గోపాలానికి విశ్రాంతి అవసరమని డాక్టరు సర్టిఫికెట్ యిచ్చాడు. సర్టిఫికేటు లేనిదే సెలవు యివ్వరు, జబ్బుపడితే సెలవు యివ్వరు. జబ్బుకి సర్టిఫికేటు. సరేలే. ఇంక శాశ్వతమైన సెలవే తీసుకోవచ్చు వాళ్ళిచ్చినా, యివ్వకపోయినా? సుబ్బులూ నీతో చెప్పలేదు. మా ఆఫీసులో పనిచేసే అరవ గుమాస్తా వున్నాడు చూశావు. అతన్ని అక్కొంటెంటు చేస్తారట. ఎంతకాలం రాత్రింబగళ్లు పనిచేసి ప్రాణాలు ధారపోసినా మనం యింతే, కనుబొమ్మలమీద వెంట్రు కలలాగ ఎదుగూ బొదుగూ లేదు.

సుబ్బ : ఆ ఆఫీసు గొడవలు మాట్లాడకండి. మళ్ళీ తలనొప్పి వస్తుంది.

గోపా : తలనొప్పి!... బ్రతుకే తలనొప్పి ఆఫీసంటె తలనొప్పి. అవును. దీపంవుండగానే చక్కబెట్టుకోవడం మంచిది. ఇంతరాద్ధాంతం జరిగిన తర్వాత ఆ ఆఫీసులో పనిచెయ్యను.

సుబ్బ : పనిచెయ్యవద్దులెండి, మాట్లాడక పడుకోండి.

గోపా : పనిచెయ్యకపోతే ఏం చేస్తాం? మనకు తండ్రి తాతలు గడించిన పొలం పుట్రా ఏమన్నావున్నాయా? మనకున్నదల్లా ఆ అయిదెక రాల మెట్ట కొత్తబిల్లు వస్తుందని ముందే శిస్తులవసూళ్ళు కొండెక్కిపోయాయికదా? రామపాదసాగరం ప్రాజెక్టువస్తే యీ మెట్ట మనమే పండించుకోవచ్చు. రాష్ట్రం-రామపాదసాగరం ఐడెంటికల్ ఈక్వేషన్లు (Identical Equations) అంటే సమానాంతరాలు. అదొస్తేగాని యిదిరాదు. యిదొస్తేగాని అది రాదు. కర్మం నీకు లెఖలు అసలేరావు, సరేగాని ఐన్‌స్టీన్ కొత్త ఈక్వేషన్ వేశాడుట విన్నావా? నన్నడుగు చెప్తాను. లెఖల్లో ఫస్టుక్లాసు. ఈక్వేషన్ ఎన్నివేస్తే యీ జీవిత సమస్య తేల్తుంది. జీవితం పెద్ద ప్రాబ్లం. (Problem) పెద్ద ప్రశ్నార్థకం.

సుబ్బులూ నీ కళ్ల ప్రశ్నార్థకాల్లాగ ఎంత కొంటెగా చూస్తు న్నయ్యో!

సుబ్బు: మాట్లాడక కొంచెంసేపు పడుకోండి. నా కళ్ళు ఎక్కడికిపోతాయి? మీ కవిత్వాలు ఎక్కడికి పోతాయి?

గోపా: కవి, ప్రియుడు, పిచ్చివాడు ఒకటే నన్నాడు షేక్స్పియర్. పత్రికల్లో నా వ్యాసాలకు బహుమతులు రాకపోయినా అవి నన్ను కవిని చేశాయి ఒప్పుకుంటావా?

సుబ్బు: మీరు కవికాదని ఎవరన్నారు? ఆ మూడోవారుకూడా అయ్యారు లెండి. నా మాటవిని కొంచెంసేపు పడుకోరూ?

గోపా: పిచ్చివాణ్ణి అయ్యానంటావా? అంతేకాదు ప్రియుణ్ణి, లవర్‌నీ కూడ అయ్యాను. ప్రేమిగాక పిచ్చి కామిగాడు ప్రేమించాను ప్రేమించి ప్రేమగీతాలు వ్రాశాను—ప్రేయసీ నిను కనుగొన్న ప్రియ వసంత యువశుభోదయ వేళాముహూర్త మింక మరచి పోలేను. ప్రియసఖి మరవలేను. ఏదీ ఒకసారి సాక్షాత్కరించు మిపుడు......

సుబ్బు: మీరు వూరుకోరు కదూ? నేను వెళ్ళిపోతానులెండి.

గోపా: సుబ్బులూ నువ్వుకూడ వెళ్లిపోతావా వాళ్ళలాగ? నేను ప్రేమిం చిన అమ్మాయిలంతా వెళ్ళిపోయారు. నీవు కట్టుకున్న ధర్మ పత్నివి. నువ్వుకూడానా?

సుబ్బు: నే నెక్కడికి వెళ్తాను. ఇక్కడే వుంటాను. కాస్త కళ్లమూసు కుని పడుకోండి.

గోపా: కళ్ల మూతలుపడవు. గ్రుడ్డికన్ను మూసినా ఒకటే, తెరచినా ఒకటే. అబ్బ! ఇవన్నీ ఎలాగ మరిచిపోను. ఉద్యోగం - ఇంటి యిబ్బంది, రేపు 15 వ తేదీకి మనం ఇల్లు ఖాళీ చెయ్యాలి. తెలుసు కదూ సుబ్బులూ?

సుబ్బు: మళ్ళీ అప్పులు చేశారుకాదూ?

గోపా: అప్పులు ఎవరికి ? భగవంతుడికి చెయ్యాలి. యీ పెళ్ళాం బిడ్డలతో ఎక్కడికి వెళ్తాం. వాడి దిక్కున్నచోట చెప్పుకోమను. యీలాటి వాళ్ళని చాలమందిని చూశాం.

సుబ్బ: అబ్బ! ఎందుకండి ఆ గొడవలన్నీ యిపుడు. మీరు నిశ్చింతగా కొంచెంసేపు పడుకోండి, అలా విడవకుండ మాట్లాడుతూవుంటే నాలిక పిడచకట్టుకుని పోతుంది, కాసిని మంచినీళ్లు యివ్వమంటారా?

గోపా : మంఛినీళ్ళు...ఆ...తే...అబ్బ! చేదు విషం, జీవితమే చేదు విషం.

ఔనౌనుసుమా నీవన్నది నిజం నిజం

మనమంతా గానుగలం పీనుగులం

సందులలో పందులవలె, కుక్కలవలె, నక్కలవలె

బ్రతుకువృథా, చదువువృథా, జీవఫలం చేదువిషం.

సుబ్బ: ఎందుకలాగ నిరాశపడతారు? మీకేమండీ, మీ చదువు వృధా ఏమిటి? ఫస్టుక్లాసులో పాసైనట్లు చెప్తూవుంటారు.

గోపా: వృధాకాక ఏమిటి? ఫస్టుక్లాసు గోల్డు మెడలిస్టు గోపాలం గుభేలు దస్త్రాల గుమాస్తా అయితేను. నేను వల్లెవేసిన షేక్స్పియర్ నాటకాల తప్పులు దిద్దటానికి రాకుగదా? నేను కంఠతాపట్టిన కాలిక్యులస్ నా ప్రొఫార్మా అకౌంట్లు సరిపుచ్చడానికి పనికి వస్తుందా?

సుబ్బ: ఏంచేస్తాం ఎవరికెంత ప్రాప్తో అంత, ఆ గుమాస్తావని లేక కష్టపడే వాళ్ళెంత మందున్నారు? మీతో చదువుకున్న ఆ శర్మను చూడండి ఎన్ని అవతారాలు మార్చాడో?

గోపా: ఎన్నిమారితేనో ఆఖరికి భీమాఏజెంటుగా వుండి బాగా సంపాదించాడు, అన్నట్లు మన ప్రీమియమ్ వచ్చే 22 వ తేదీకి పంపిం

చాలి. జ్ఞాపకం వుంచుకో. ఒకవేళ నేను హఠాత్తుగా హరీఅంటే మీకదే ఆధారం.

సుబ్బ: అబ్బ! అలాంటి అఘాయిత్యపుమాట అనకండి. సుఖాన్నివున్న ప్రాణాన్ని కష్టానపెట్టారు... చూడండి. యీ తెల్లమాత్ర వేసుకుని చూస్తారా? దాంతో కొంత వుధృతం తగ్గుతుందేమో?

గోపా: ఆ మందుసంగతి నీకు తెలియదు. గుండెలమీద దాని బలంవల్ల ఏం జరిగినా జరుగుతుంది. వద్దులే.

సుబ్బ: అయితే పోనీలెండి. డాక్టరుగారు వచ్చి మళ్ళీ చూస్తానన్నారు. ఇంకా రానేలేదు.

గోపా: డాక్టర్లకు మనవంటి పేదవాళ్ళం జ్ఞాపకం వుంటామా? వెర్రిదానా! వాళ్ళకి ఎవరు డబ్బిస్తే వాళ్లు,

సుబ్బ: మన డాక్టరుగారు అటువంటివారు కాదండి. మన్ని ఎంతో ఆదరంగా చూస్తున్నారు, డబ్బు యివ్వకపోయినాగాని.

గోపా: నా క్లాసుమేటు అతను. చిన్ననాటి స్నేహం. అంత త్వరగా మరిచిపోలేదు. చూడు ఎవరో వస్తున్నట్టున్నారు,

సుబ్బ: రండి డాక్టరుగారూ! మీ మాటే అనుకుంటున్నాం. వెయ్యేళ్ళు ఆయుష్షు.

డాక్టరు: అలాగటమ్మా.

గోపా: డాక్టర్ వచ్చావా? ఇపుడే అనుకున్నాం,

డాక్టరు: అయితే గోపాలం అప్పటినుండి నిద్రపట్టలేదూ?

గోపా: లేదు డాక్టర్.

సుబ్బ: అప్పటినుంచీ ఆవరసమ అలా మాట్లాడుతూనే వున్నారు.

డాక్టరు: ఆ పెద్దమాత్ర ఒకటి యివ్వలేకపోయారా?

సుబ్బ: అవి తీసుకుంటే గుండెనొప్పి అన్నారు.

గోపా: అవును డాక్టర్ నేనే వద్దన్నాను. అసలే గుండె నీరసంమీద అది వేసుకుంటే ఏమవుతుందో అని.

డాక్టరు : పోనీలే ఏదీ టెంపరేచరు చూద్దాం.

సుబ్బ : డాక్టరుగారూ ఆయన్నిచూస్తే భయంవేస్తూ వుందండి. ఊరికే ఏమిటో చెప్పబోతారు. అతిధోరణి.

డాక్టరు : అవును. ఆ ధోరణి అలాగేవుంటుంది. కొంచెంసేపు నిద్రపట్టితే ఆ నిద్రలో యివన్నీపోతాయి.

సుబ్బ : నిద్రమాత్రం పట్టకుండ వుందండి.

డాక్టరు : తలమీద ఐస్‌బాగ్ పెట్టి చూచారా ?

సుబ్బ : పిల్లవాణ్ణి పంపించాను, ఇంకా తేలేదు.

డాక్టరు : అదిపెట్టే తలమీద వేడి దిగిపోతుంది, ముందు జ్వరంచూచి...

సుబ్బ : ఒళ్ళు చింతనిప్పులాగ కాలిపోతూవుందండి.

డాక్టరు : అవును. జ్వరం తీవ్రంగానేవుంది. ప్రస్తుతం ఏంమందూ యివ్వ నక్కరలేదు. ఐస్ వచ్చింతర్వాత తలమీద పెట్టిచూడండి.

గోపా : మరేం భయంలేదుకదా డాక్టర్.

డాక్టరు : ఏమీ భయంలేదు. నువ్వు నిశ్చింతగా పడుకోవచ్చు.

సుబ్బ : ఇంజక్షన్ యివ్వరాఅండి డాక్టరుగారూ ?

డాక్టరు : ఇంజక్షన్ జ్వరం తగ్గితేనేగాని యివ్వటానికి వీలులేదమ్మా. రేపుఉదయంవచ్చి యివ్వొచ్చులెండి.

సుబ్బ : ఇప్పుడు మరింకేం మందూ యివ్వరాఅండి.

డాక్టరు : అక్కరలేదు. ప్రస్తుత పరిస్థితిలో మనం ఏం మందూ ఇవ్వ కూడదు.

సుబ్బ : అంత ఎక్కువగా వుందాఅండి డాక్టరుగారూ ? మరేం భయం లేదుకదాఅండి. మాకింకేదిక్కూ లేదు.

డాక్టరు : అధైర్యపడకండమ్మా ! ఏమీ భయంలేదు.

గోపా : స్లీపింగ్‌డోస్ యిస్తావా డాక్టర్.

డాక్టరు : ఆ ఇప్పుడేమీ అక్కరలేదు. తలమీద వేడితగ్గితే దానంతట అదే నిద్రపట్టుంది.

సుబ్బ : రాత్రికి జావ అదీ ఏమన్నా ఇవ్వమంటారా ?

గోపా : నాకేమీవద్దు. అసలు ఆకలే లేదు.

డాక్టరు : ఆకలి లేకపోతే ఏమీపెట్టవద్దు, కొంతసేపయినతర్వాత వేడికాఫీ యివ్వండి.

సుబ్బ : అలాగే యిస్తానండి...తమరు వెళ్తున్నారా ? పిల్లవాడయినా లేడు దీపం చూపడానికి.

డాక్టరు : అక్కరలేదులెండి. గుడ్‌నైట్ గోపాలం.

సుబ్బ : అబ్బ ! ఆయనకి అమిత పేలాపనండి. వింటూవుంటే నా కెంతో భయంగా వుంటుంది, మరేం ఫరవాలేదు కదాఅండి.

డాక్టరు : ఆ జ్వరంతీవ్రత అలాగ చేయిస్తుంది. వేడి మెదడుకెక్కి వెర్రి వెర్రిమాట లాడిస్తుంది. అంత మాత్రంచేత భయపడనక్కరలేదు. మరేం ఫరవాలేదు.

సుబ్బ : మీరు ధైర్యంచెప్తే నాకు విశ్వాసం వుందిలెండి మరి సెలవు వెళ్ళిరండి. ఉదయంవచ్చి యింజక్షన్ యిస్తారుకదూ ?

డాక్టరు : తప్పకుండాను, మీరు వుండండి. (కారు వెళ్ళిపోయిన చప్పుడు)

గోపా : సుబ్బులూ డాక్టరు వెళ్ళిపోయాడా ?

సుబ్బ : వెళ్ళాడు.

గోపా : ఏమంటాడు. నాకీజ్వరం తగ్గుతుంది అంటాడా ?

సుబ్బ : రేపువచ్చి ఒక యింజక్షన్ యిస్తే అదే తగ్గిపోతుంది అన్నారు.

గోపా : తగ్గకుండ నేనిలాగ వెళ్ళిపోతే ఏంచేస్తావు సుబ్బులూ. ఆయిమ్నా రెన్సు కాగితం పెద్దపెట్టెలో వుంది. నీపేర వ్రాశాను. ఈతంపెనీ వాళ్ళు పేచీపెట్టకుండ అంతడబ్బు యిచ్చి వేస్తారులే.

సుబ్బ : అవేం పాపపు మాటలండీ సుఖంగా వున్నయింట్లో.

గోపా : ఒకటేసుఖం !... సుబ్బులూ నాతో నువ్వెప్పుడైనా సుఖపడ్డావా? నీకు మంచి చీరలు కొనిపెట్టానా? ఒక నగ చేయించానా? సరియైన తిండిపెట్టానా? అంత నీరసంగావుంటే బలానికి మందు కూడ యిప్పించలేకపోయాను. చూడు ఎలాగైపోయావో? అలా వున్నా యింటెడుచాకిరీ చేయిస్తున్నానేకాని నీకు సహాయంచెయ్యటానికి ఒక్క నౌఖరునైనా పెట్టుకునే తాహతు లేకపోయింది. ఎందుకొచ్చిన భర్త. నీకేం సుఖం యివ్వలేకపోయిం తర్వాత? పోనీ నేను పోయినతర్వాత యింకొక......

సుబ్బ : ఛీఛీ! అవేం మాటలండి. నాకు మీరేం లోటుచేశారని. మీరు కాసేపు నిద్రపోరూ?

గోపా : నిద్ర!...నిద్రలో స్వప్నాలు. స్వప్నాలులో స్వప్నసుందరులు నిజం మరచిపోవటానికి నిద్ర. అవును. యధార్థ జీవితంలో జరిగే కష్టాలన్నీ మర్చిపోవడానికి నిద్రలోకం మంచిదే. అదొకజగత్తు. సుబ్బులూ! నిద్రలోకూడా యీ మేనేజర్లు, అక్కౌంటెంట్లు, యీ యింటివాళ్లు, పోటీసులు. యీ రేషన్లు, పాలడబ్బాలు యివన్నీకని పిస్తాయా? ఆ! పిల్లకిపాల డబ్బావుందా? అయిపోయిందా?

సుబ్బ : ఇంకా రెండురోజులు వస్తుంది.

గోపా : ఒక వారంరోజులుండగానే ఎందుకు చెప్పలేదూ?

సుబ్బ : పాలడబ్బాలు దొరకటంలేదని చెప్పి తిరిగివచ్చారుకదూ?

గోపా : కొరియా యుద్ధంతోపాటు పాలడబ్బాలు బ్లాకుమార్కెట్లు వేంచేశాయి.

సుబ్బ : ఇప్పుడప్పుడే రావు కావాల్ను.

గోపా : ఎందుకొస్తాయి. యుద్ధాలు బ్లాక్‌మార్కెట్లకోసం, బ్లాకుమార్కెట్లు హెచ్చులాభాలకోసం. పిల్లలకి పాలుంటేనే? లేకపోతేనే?

సుబ్బ : పోనీలెండి. మీకు నెమ్మళించనివ్వండి. ఏధరకో ఓధరకి తెచ్చుకుందాం.

గోపా : నేను మంత్రినైతే ఏంచేస్తానోతెల్సా... ముందు యీ బ్లాక్ మార్కెట్టు దారులనందరినీ నడివీధిలో గాడిదలమీద ఎక్కించి చింత బరికెలతో వూరేగిస్తాను.

సుబ్బ : ఎందుకొచ్చిన మాటలు. ఊరేగిస్తే వాళ్లూరు కుంటారు ? కొనేవాళ్ళ అవసరంకొద్దీ బ్లాకుమార్కెటు.

గోపా : అందుకే మంత్రినవ్వాలంటున్నాను.

సుబ్బ : మీరుకూడ అయ్యేవరకే. ఆ కాస్తపదవీవస్తే మీరు అందరిలాగే తయారవుతారేమో ? కళ్లుమూసుకోండి.

గోపా : ఏం నేనవలేనంటావా ? పిచ్చిదానా ! మనమంతా మంత్రులం అవుతాం. కొత్త రిపబ్లిక్ వచ్చింది. కొత్తరాజ్యాంగంలో ఏడు కోట్లమందికి ఓట్లున్నాయి. రిపబ్లిక్ అంటే ప్రజారాజ్యం. జయ భారత్ ! సత్యమేవ జయతే !!

సుబ్బ : మీరూమంత్రి అవ్వొచ్చులెండి. ముందు నిద్రపోండి.

గోపా : పేపరు వచ్చిందేమో చూడు మనల్ని యు. యస్. ప్రతినిధిగా అమెరికాకు పంపించారేమో చూడాలి. ఎందుకు నవ్వుతావు? నేను అమెరికాకు వెళ్లలేనంటావా ?

సుబ్బ : అలాగే వెళ్దురుగానిలెండి ముందీజ్వరం తగ్గనీయండి.

గోపా : ఎందుకు వెళ్ళలేనూ ? మనకు రాబోయేది రవి మహాదశ. దాని ప్రారంభంలో సముద్ర ప్రయాణంవుంది. ఈరోజుల్లో ప్రతి వస్మరంతిగాడు అమెరికా వెళ్తున్నాడు. నేనూ వెళ్తాను.

సుబ్బ : అలాగే వెళ్ళొచ్చులెండి. కాసేపు కన్నుమూసుకుని పడుకోరూ ?

గోపా : సుబ్బులూ! నేను అమెరికాకు వెళ్తే అక్కడ దొరసానిని పెళ్లి చేసుకుని వస్తానని భయపడుతున్నావా ? పిచ్చిదానా! ఎంత చదువు రాకపోయినా వెయ్యిదొరసానులు కూడా మా సుబ్బులుతో సరితూగలేరు. అవును నీకు ఇంగ్లీషు చదువురాదు. పాడటం:

డాన్సు చెయ్యడం చేతకాదు. ఉపన్యాసాలు యివ్వలేవు. అయినా సరే నువ్వు మంచిదానివి, భయపడకు నిన్ను వదిలిపెట్టెయ్యనులే.

సుబ్బ : వదలిపెట్టెయ్యద్దులెండి, నామాటవిని కాస్సేపు తలవాల్చరూ ?

గోపు : సుబ్బులూ నీకేం తెలుసు మలేరియా సంగతి. మాట్లాడేకొద్దీ మాట్లాడిస్తుంది, నువ్వెప్పుడైనా మలేరియా పడ్డావా ? లేదు, లోకంలో ప్రతివ్యక్తి మలేరియాజ్వరం పడాలంటాను నేను. లేకపోతే ఎన్నోవిచిత్ర రహస్యాలు జీవితంలో తెలిసికోకుండానే సంధ్యవాలి పోతుంది. జ్వరంతగ్గనీ నేనోపెద్ద కథవ్రాసి ప్రకటిస్తాను.

సుబ్బ : అలాగే వ్రాయవచ్చునులెండి. పడుకోండి.

గోపా : ఆంధ్రుడు హాయిగా నిద్రపోతాడు, కాని చావలేదు చావలేదు, ఆంధ్రుల మహోజ్వలపౌరశక్తి అంటాడు. హృదయముల చీల్చి చదువుడో సదయులార అంటాడు. చూడు నా హృదయంలో చీల్చి పరికించు. ఎంతమంది ప్రియురాళ్ళు కనిపిస్తారో ? పూర్తి కాని ప్రేమకావ్యాలు ఎన్ని వినిపిస్తాయో ?

సుబ్బ : అదుగో అబ్బాయివచ్చాడు, ఇంత ఆలస్యం అయిందేరా నాయనా.

అబ్బాయి : మంచుగడ్డ ఎంతసేపటికీ యివ్వలేదమ్మా ! పేపరుకూడ ఎప్పటికీ రాలేదు, అందుకే ఆలస్యం అయింది.

సుబ్బ : నేనీ మంచుగడ్డ ఐస్‌బాగ్‌లో వేసితెస్తాను. నాన్నగారిని చూస్తూ వుండు.

గోపా : నాన్నగారు ఎక్కడికీ పారిపోరులే వెళ్లిరా. అబ్బాయి ! పేపరు తెచ్చావురా ?

అబ్బాయి : కొరియాయుద్ధంలో అమెరికన్ సేనల ఉపసంహారం.

గోపా : సరే తీసెయ్. మనదేశం సంగతి చదవరా ?

అబ్బాయి : ఇండియాకు జపానుబల్లుల కానుక. ఏనుగలకు బదులు బల్లులు,

గోపా : అవును యిలాంటివాటితో సంతోషించవలసిందే.

అబ్బాయి : పంచదార ఉత్పత్తి తగ్గిందట.

గోపా : మంచి తరుణం, మించిన దొరకదు. బ్లాకుమార్కెట్టు దార్లకు మంచి లాభం. అబ్బాయి మన పంచదార రేషను తెచ్చావురా?

అబ్బాయి : తెచ్చానండి నాన్నగారు, కాని మనకు రావలసిన రెండువీశలకు అరవీశే యిచ్చాడు. యీనెల సప్లయి తక్కువ వచ్చిందట.

గోపా : ఏడవలేక పోయాడు. తర్వాత చదువు, బంగారం ధర చూడు ఎలాగుందో ?

అబ్బాయి : సవరన్ ఒక్కింటికి రు. 76—12—0.

గోపా : మళ్ళీ మనం యిపుడపుడే కొనుక్కోలేములే.

అబ్బాయి: నాన్నగారు నాకు చొక్కాలు కుట్టిస్తానన్నారు కదండీ.

గోపా : కుట్టిస్తాలేరా నాయనా! వచ్చేనెలలో మనకు బోనస్ వస్తుంది దాంతో నీకు చొక్కాలు.

అబ్బాయి : అమ్మకు గాజులుచేయిస్తా నన్నారు?

గోపా : అవిన్నీ, దాంతో అన్నీ వస్తయ్.

అబ్బాయి : నా స్కూలుజీతం రేపు 16 వ తేదీకి యివ్వకపోతే జరిమానా వేస్తారట నాన్నగారూ—

గోపా : ఓహో అదొకటా? నీకు జీతం, మీ చెల్లెలికి పాలడబ్బాలు, మీ అమ్మకు మందుసీసా, నాకు యింజెక్షన్లు.

సుబ్బ : ఇంకా మాట్లాడుతూనే వున్నారా? ఈ ఐస్‌బాగ్ తలమీద పెట్టుకోండి, ఆ వుత్తాపం తగ్గుతుంది.

గోపా : తెచ్చావా అలాగే పెట్టుకుంటానులే, అబ్బ సుబ్బులూ నన్నింత బాధ పెట్టున్నావు. యిక చచ్చిపోతాన్లే.

సుబ్బ : ఆ అఘాయిత్యపుమాట అనవద్దని ఎన్నిసార్లు చెప్పనండీ, ఆ మాటఎత్తక కళ్ళుమూసుకుని పడుకోండి.

గోపా : పాపఏదీ నిద్రపోయిందా?

సుబ్బ : ఇంతసేపూ మీ మాటలుచెప్పి నిద్రపోయింది.

గోపా : సుబ్బులూ నేనుపోతే యీ పిల్లల్ని ఎట్లా పెంచుకుంటావు.

సుబ్బ : అదుగో మీతిక్క మీదే. యీ వెధవమాటలు మానరుగదా ? పిల్లలెదుట అలాంటి మాటలంటే జడుసుకుంటారండీ.

అబ్బాయి : నాన్నగారికి జబ్బు అంత ఎక్కువగా ఉన్నదేమిటే. డాక్టరు గారిని పిలుచుకుని రానా ?

సుబ్బ : డాక్టరుగారు యిప్పుడేకాదూ వచ్చివెళ్ళారు ?

అబ్బాయి : ఏమన్నారు ? మందివ్వలేదా ?

సుబ్బ: మందు అక్కరలేదన్నారు.

గోపా : ఇక లాభంలేదని ఆయనకీతెలుసు. నేను చచ్చిపోతాను. నా బొమ్మ పత్రికల్లోనైనా వేస్తారంటావా ? కీర్తిశేషులని ప్రకటించరూ ? ఇన్నికోట్లజనాభాలో ఒక గుమాస్తాపోతే ఎవరికి లెక్క? ఎందుకు ఇవన్నీ. నేనీ జీవితంలో ఏం సాధించానని. నా జీవితమంతా ఆఫీసుకు అర్పించి, చచ్చేటట్టు చాకిరీచేశాను. ఆఫీసు నా రక్తమాంసాలు పిండుకుంది. కాని సమయంవస్తే నాకు రావలసింది మరొకడి కిచ్చింది. వాళ్ళకి నేనుపోతే మరొకడు.

సుబ్బ : ఆ మాటలన్నీ ఎందుకు త్రవ్విపోసుకుంటారు. మీరుపోతే మేం మాత్రం వుంటామా ఏమిటి ? ముందు నన్నూ, పిల్లల్నిచంపి మీరు పొండి. కాఫీ కాగింది. వేడివేడి కాఫీతీసుకుంటే చెమట పట్టి నిద్రవస్తుందేమో ? తేనా ?

గోపా : కష్టాలూ బాధలూ మర్చిపోవటానికి కాఫీ. సరే ఇలాతే.

అబ్బాయి : నాన్నా తలవత్తమంటావా?

గోపా : వద్దులే. అబ్బాయ్ ఒరేయ్ మీ అమ్మచెప్పినట్టు విని శ్రద్ధగా చదువుకుంటావా ? మీనాన్న ఏరిఅంటే ఏమంటావు ?

అబ్బాయి : నాన్నా నిజంగానీకు జ్వరంతగ్గదూ ! అయ్యో ! (ఏడుస్తాడు)

గోపా : అబ్బాయి ! పాపా ! సుబ్బులూ !!! (ఏడుస్తాడు)

సుబ్బ : అదేమిటండీ మీరే అలా అధైర్యపడితే మేం గుండెలుపగిలి చావమూ! ఈ కాఫీ తీసుకోండి.

గోపా : తల పగిలి పోతూవుంది, ఏది కాఫీ.

సుబ్బ : అబ్బా! ఏమిటండీ అలా చూస్తున్నారేమిటండీ ; మాకు ధైర్యం చెప్పండి.

గోపా : సుబ్బులూ! సుబ్బులూ! ఏదీ నీచెయ్యి.

సుబ్బ : అయ్యో! మమ్మల్ని ఏంచెస్తారండీ.

గోపా : భయంలేదులే, సుబ్బులూ నీచల్లని చెయ్యివేస్తే నా జర్వం తగ్గి పోతుంది. అలాగే నిద్ర పట్టుందేమో!

సుబ్బ : అబ్బాయి నువ్వువెళ్ళి పడుకో; అ ఐస్‌బాగ్‌నన్ను పట్టుకోనియ్యి.

గోపా : అబ్బ! తలఎంత బరువుగావుంది. అందుకనే మేనేజరు నన్ను తలబరువా డన్నాడు. ఎవడికున్న తలబరువు వాడి కుంటుంది. వాడికేం తెలుసు?

సుబ్బ : మళ్ళీమొదలు పెట్టారూ? నామాటవిని యింక ఆఫీసు గొడవ ఎత్తకండీ: ఈ జ్వరంలోకూడ ఆపాడుసంత ఎందుకు?

గోపా: ఆఫీసునన్ను పూర్తిగా కొనివేసింది, నా సర్వస్వం వాళ్ళకే సమర్పించాను. వాళ్ళిచ్చే రు 144-15-0 నెలజీతానికి వాళ్ళకి అమ్ముడు పోయాను, మన జీవితం వేలంపాట, మనుష్యులశక్తి రూపాయిలు అణాలతో జమకట్టున్నారు. నీ విలువ యింత, నా విలువ అంత, గోపాలం ధర రు 144-15-0,

సుబ్బ : నేనిక్కడ వున్నంతసేపూ ఏదో యిలానే అంటూవుంటారు.

గోపా : నువ్వువెళ్తె నాకునిద్ర పట్టుందంటావా? కల్ల! పొడికళ్ళతో అలాగ చూస్తూవుంటే విచిత్రానుభవాలు గిర్రున తిరిగి పోతూ వుంటయి.

సుబ్బ : పోనీ అదైనా మంచిదే యీ పిచ్చిమాటలకంటే నేనుపోయి ప్రక్క వసారాలో వుంటాను. ఏదైనా కావలిస్తే పిలవండి.

గోపా : వెఱ్ఱిపాపం పడుకో. ఎంతసేపని కూర్చుంటావు పడిగాపులుపడి.

[వాయిద్యం]

సుబ్బి : (ప్రవేశించి) నిద్రపోతున్నారా ఏమండీ! అమ్మయ్య ఇంతసేపటికి నిద్ర పట్టింది, కొంతనయం, రేపటికి దేవుడి పుణ్యమా అంటూ తగ్గిపోతే,

[తెల్లతెరమీద నల్లని ఛాయగా కనిపిస్తూవుంటే,
గోపాలం నీడ తో శ్రీకృష్ణుడంటూ వెళ్తూవుంటే]

ఎచటికోయీ ప్రయాణము
ఈనడిరేయి ప్రయాసము
ముసరి ముసరి కొనుకారు మబ్బులవి
కసరి కసరి గర్జించుచున్నవి
విసరి విసరి వేసారి పోతివిక
ముసురులోన నీవెందుపోయెదవు ॥

ఇల్లువిడచి యిల్లాలిని విడిచి పెల్లుకష్టముల కోనచేరితివి
కల్లోలపు పెనుగాలి వెల్లువల తల్లడిలిన ఉల్లమునీకున్నదా?॥

[తెరపడి పోతుంది. విచారకరమైన ధ్వని–చీకటి తుపాను గాలివీచి ఆగిపోయినట్లు నే పథ్యంలో ]

అతడావాత పరం పరా పరిమళ వ్యాపారలీలన్
జనాన్విత మిచ్ఛోటని చేరబోయి కనియెన్
విద్యుల్లతా విగ్రహన్, శత పత్రేక్షణ చంచరీక
చికురన్, చంద్రాస్య చక్ర స్తనిన్, నతనాభిన్
నవలా నొకానొక మరున్, నారీశిరోరత్నమున్.



# తీరని కోరికలు

## రెండవ రంగం.

[ గాలి, చీకటిపోయి క్రమేపి వెలుగురాగానే విద్యుల్లత
ప్రవేశించి ఆనందంగా పాడుకుంటుంది అభినయ నృత్యంతో. ]

చిన్నవాడ రావోయీ చిన్నదాన నేనోయీ
నిను వలచియున్నదాన రావోయీ॥
చక్కిలిగింతల సరసమాడు చందమామ నీవైతే
చుక్కలవిరిసిన సుశరీరను సుధాచంద్రికను నేనే॥
ఝుమ్మఝుమ్మని ముదానపాడుకొను తుమ్మెదరేనివి నీవైతే
కమ్మనివలపుల క్రొమ్మెరించు పూవరిమళమ్ము నేనేరా॥
హృదిలోనిండిన తీయనికోరిక నీవైతే
చదలంతా కాంతుల వెదజల్లిన మాయతారక నేనేరా॥

[నేపథ్యంలో]

ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ ఒంటి
చరించె దోటలో కివ్వనభూమి.........
భూసురుడ నే....................

గోపా: ఎవరమ్మాయి నిన్నెక్కడో చూచినట్టుగావుంది. ఆ చూడలేదు గాని నీ సంగతి విన్నాను. కాదు చదివాను. వరూథిని అంటారు కదూ నిన్ను. ఆ ప్రవరుడంటే చాదస్తుడు నిన్ను ముట్టుకుంటేనే

మైలపడి వచ్చేశాడుకాని నేను .... ఆ వీణావాయిద్యం ఏదీ ? ఆ చెంగులువకేదారతీరం ఏదీ ?

విద్యుల్లత : మీరు ఏం మాట్లాడుతున్నారో నాకు బోధపడటంలేదు.

గోపా : అదేమిటి అలాగంటారు ముత్యాలపలుకుల్లాగ తెలుగుపలుకుతూనూ ? అయితే చూడండి మీకు తెలుగు వచ్చునన్నమాట,

విద్యు : (మాటలాడక నవ్వుతుంది)

గోపా : నా వెర్రిగాని మీకు తెలుగురాకుండానే అంత్యగంధం ఎలాగ నడిపిస్తారు మా ప్రవరాఖ్యుడితో. నేను వరుణాద్వీప నదీతీరంలో లేనుగాని మా కాపురం గోదావరీతీరంలో. ప్రస్తుతం ఉద్యోగం కోసం కూమునదీతీరంలో ఉంటున్నాను—

విద్యు : ఓహో !

గోపా : అక్కడ నేను ఉండేది అద్దెయిల్లులెండి. అదికూడ ఖాళీచేసి పోవాలని యింటివాడు నోటీసిచ్చాడు. కోర్టులో కేసుపెట్టాడు. చివరికి రాద్ధాంతాలు సిద్ధాంతాలుచేసి కోర్టువాళ్ళు యీనెల 15 వ తేదీకి యిల్లు ఖాళీచెయ్యాలని తీర్పుచెప్పారు. ఇల్లు ఖాళీచెయ్యకపోతే యింటివాడు ఏమైనాచేస్తాడు అనిచెప్పి ...... నాకు మతిపోయింది.

విద్యు : ఎంతమాట !

గోపా : ఇది ఒకటేకాదు, చూడండి వరూధినిగారూ !

విద్యు : అది నా పేరుకాదు.

గోపా : అయితే ఏమని పిలవమంటారూ ?

విద్యు : మీకు ఏపేరునచ్చితే ఆపేరుతో.

గోపా : అయితే నాకు తెలిసిన అమ్మాయి ఒకావిడ ఉండేది లక్ష్మి అని. ఇప్పుడు సినిమాల్లో ప్రవేశించి విద్యుల్లతాదేవి అయింది, పైగా మీ అందంచూస్తే మెరుపుతీగలాగ అంటే విద్యుల్లతలాగానే

ఉన్నారు అందుకని మిమ్మల్ని విద్యుల్లతాదేవిగారూ అని పిలుస్తాను.

విద్యు : సరే మీ యిష్టం.

గోపా : చూడండి విద్యుల్లతగారూ....'గారూ' తెలుగులో గౌరవవాచకం లెండి—

విద్యు : అది సరే. ఆ గౌరవం నాకెందుకూ అని.

గోపా : అదేమన్నమాట. నేను నెల రు 144—15—0 నెల గుమాస్తా గాడిని, కొన్ని లక్షలు సంపాదించే ఫిల్మ్‌స్టారు మీతో మాట్లాడు తున్నప్పుడు గౌరవం చెయ్యవద్దా ?

విద్యు. గౌరవం ధన సంపాదనతో వస్తుందా ?

గోపా : తప్పకుండాను. మనిషివిలువ రూపాయిలు అణాలు పైసలతో కట్తారు.

విద్యు : అవును పాపం. అంత తక్కువజీతంతో.

గోపా : ధరలు మండుకొనిపోయే మద్రాసులో. బ్లాక్‌మార్కెట్‌లో బియ్యం కొని నావంటి చిన్నజీతగాడు కాపురం చెయ్యడమంటే నరక లోకంలో జీవించడమే.

విద్యు : అవును పాపం.

గోపా : ఇంతకీ చెప్పొచ్చిన మాటేమిటంటే యీ సంసార తాపత్రయం పడలేక నాకు విసుగొచ్చింది. పైగా మా మేనేజరొక ఛండాలుడు. నన్ను నానా అవస్థలూపెట్టి ఉద్యోగం వూడదీస్తానని బెదిరిస్తు న్నాడు. తమ్మిృతే ఊడేమున్కు ఎన్నాళ్ళుంటుందని నేనే రాజీ నామా యిచ్చేసి యిలా చక్కా వచ్చేశాను.

విద్యు : మంచిపనిచేశారు. తర్వాత ఏంచేద్దామని.

గోపా : ఏంచేస్తాను ? ఇంటికి వచ్చేసరికి మా ఆవిడ యీమాటవిని మరింత ఖస్సుమంది. చేతిలో డబ్బులేదు. ఆఫీసులో అల్లరి. ఇంటిసమస్య యీ బాధలన్నీ పడలేక యీ అడవిలోకి పోయి

(3)

తపస్సు చేసుకుందామని పారిపోయి వచ్చాను. నిజాన్ని ఎదుర్కోలేకపోతే నావంటి భీరువులు చేసేపని పలాయన మంత్రం పఠించడమేగా ?

విద్య : అడవిలో మాత్రంశాంతి వుంటుందనా ?

గోపా : ముక్కుమూసుకుని తపస్సు చేసుకుంటే దానంతట అదేవస్తుంది.

విద్య : మనస్సులో యిన్నిబాధలు పెట్టుకుని నిశ్చలమైన తపస్సు చెయ్యగలరా?

గోపా : చెయ్యలేం అనుకోండి. కాని అంతకంటె గత్యంతరం లేదు. పోతే నేను ఆత్మహత్య చేసుకుని ఇద్దైపోవాలి. చూడండి విద్యుల్లతగారూ, చూచి చూచి ఆత్మహత్య చేసుకోవటానికి ధైర్యం రాదండి.

విద్య : ఇలాగ అధైర్య పడేకంటె మీలోవున్న శక్తిసామర్థ్యాలను సరియైన వినియోగంలోకి తేవటానికి ప్రయత్నించ కూడదూ ?

గోపా : నిజమే ప్రయత్నించొచ్చు. మనకు తగిన అవకాశం ఎవరిస్తారూ ?

విద్య : అవకాశాలు ఒకరిస్తారా ? మనమే కల్పించుకోవాలి. వచ్చిన వాటిని పూర్తివినియోగంలోకి తెచ్చుకోవాలి.

గోపా : మనకు వచ్చినవి మరొకడు తన్నుకుపోతూవుంటే.

విద్య : మీ యోగ్యతలకు తగిన అవకాశం చూచుకోవాలి.

గోపా : ఇంకేమిటి వయస్సు ౩౪.

విద్య : అంత మాత్రంచేత నిస్పృహ చెందనక్కరలేదు. భవిష్యత్తు యింకా ముందున్నది.

గోపా : లెక్కల బి. ఏ. ఫస్టుక్లాసు గోల్డుమెడలు వచ్చింది.

విద్య : ఇంకా పై చదువులకి వెళ్ళలేకపోయారా ?

గోపా : పైచదువులు నాదాకా ఎవరు రానిస్తారు ? అయినా చదివిమాత్రం ప్రయోజనం ఏమిటని ఉద్యోగంకోసం తిరిగాను. కాళ్లు అరిగి పోయాయి. కాని కాగలిగింది ఒకటీకాలేదు. ఆఖరికి సర్వీస్

పరీక్షకివెళ్ళి పాసయి యీ గుమాస్తావని చేస్తున్నాను. యీ చాలీ చాలని జీతంతో సంసారసాగరం యీదలేక మతిపోగొట్టు కున్నాను. ఇది పనికాదని చతుర్థాశ్రమం సన్యాసం పుచ్చుకుందా మని వచ్చేశాను

విద్యు : మీకు భార్యవుందా ?

గోపా : భార్య, యిద్దరు పిల్లలుకూడాను.

విద్యు : అయితే వాళ్ళగతేంకాను.

గోపా : అయిదు వేల రూపాయిలకు యిన్సూరెన్సు చేయించాను. నేను చచ్చిపోయానను కుంటారు. వాళ్లకాసొమ్ము ముట్టుంది.

విద్యు : మీరు బ్రతికియుండగా ఎలా చచ్చిపోయారను కుంటారు ?

గోపా : నేను వస్తూ వస్తూ ఓవుత్తరం వ్రాసి పెటాను. యిలాగసంసార భారపడలేక విషం త్రాగి చస్తున్నానని యీసంగతి తెలిసి నాబావమరిది మావాళ్లని వాళ్ళయింటికి తీసుకొనిపోతాడు. ఎలాగో బ్రతుకుతారు. వాళ్ళకు నాకున్న యింటిసమస్య, ఉద్యోగ సమస్య, బడ్జెట్టు సమస్య యివేవీ వుండవు.

విద్యు : అయితే మిమ్మల్ని గురించి విచారించేవాళ్లు ఎవళ్ళూ వుండ రందురూ ?

గోపా : ఎవరుంటారు ? నా భార్య విచారించాలి కొంచెం, అదికూడ మనస్సులో "శని విరగడై పోయింది, రోజూ అరవచాకిరీ చేయించుకునేవాడు, ఇన్నాళ్ళకి పీడే వదిలిపోయింది" అని యింకా సంతోషించొచ్చు. పిల్లలా కొద్దిరోజులు నాన్నా నాన్నా అంటారు తర్వాత మర్చిపోతారు.

విద్యు : ఇంక బంధువులు ఎవ్వరూలేరా ?

గోపా : చెప్పామకదా నాఅనేవాళ్లు ఏవ్వరూలేరని. మా స్వస్థలం గోదావరి కద్దరిని పేరారం. అక్కడవున్న నాతాలూకు కొంప వరదలకి

కూలిపోయింది. మిగిలింది 5 ఎకరాల లంక అర్తైతులు దయతలచి యిస్తే వాళ్ళకి ఒక 10 బస్తాలువస్తయి. వాళ్ళతిండికి సరిపోతుంది.

విద్యు : మీ అత్తవారి తరపువాళ్ళ......?

గోపా : వున్నారు. మా మామగారికీ నాకూ అసలు పడదు. నా పెళ్ళికి నాలుగువేలు కట్నంయిచ్చి M. A., B. L. చదివిస్తామని చెప్పి నాలుగు దమ్మిడీలుకూడా యివ్వలేదు. దానికోసం వాళ్ళని నేనేమీ యాగీచెయ్యకపోయినా వాళ్ళే నామీద పగబట్టారు.

విద్యు : అలాంటివాళ్ళ యింటికి మీ పెళ్లాం బిడ్డలు వెళ్లిమాత్రం ఏం చేస్తారు ?

గోపా : ఎంతచెడ్డా వాళ్ళూవాళ్ళూ ఒకటే. పైగా వీళ్ల పట్టుకువెళ్ళే 5000 రూపాయిలుచూస్తే కొండమీద కోతి దిగివస్తుంది.

విద్యు : అయితే ఏర్పాటులన్నీ చేసుకునే బయలుదేరారన్న మాట.

గోపా : ఆ ! అన్నీవున్నంతలో తెగతెంపులు చేసుకునే బయలు దేరాను యీతపస్సులో అయినా విశ్రాంతగా వుందామని.

విద్యు : అయితే తపస్సు ఉద్దేశం ?

గోపా : ఇహానికిచెడ్డా పరంలోనైనా సాధిద్దామని.

విద్యు : అంటేనా అణిమాదిసిద్ధులు అలవర్చుకోవాలనా ?

గోపా : అలాంటి ఆశలుంటే మాత్రం నాలాంటివాడి కెలాసిద్ధిస్తయ్. ఈ హిమాలయపర్వత ప్రాంతాలలో గొప్పగొప్ప మహర్షులు వేల కొద్దీ తపస్సు చేస్తూ వుంటారట. అటువంటి మహనీయుల శుశ్రూష దొరికితే ఏదో తరుణోపాయం లభించక పోదని యింతదూరం వెతుక్కుంటూవచ్చాను.

విద్యు : తరుణోపాయం అంటే మీవుద్దేశం.

గోపా : నానా కష్టాలతోకూడిన యీసంసార తాపత్రయం వదల్చుకొని మోక్ష మార్గం అన్వేషించాలనే •

విద్య : దానికి ముఖ్యంగా అన్ని ఆశలూ వదలు కోవాలి. అరిషడ్వ ర్గాల్ని జయించాలి, ఇంద్రియసుఖాన్ని అరికట్టాలి.

గోపా : అవన్నీ చెయ్యాలనే యీ అడవులబట్టి వచ్చాను.

విద్య : ఆశలు ఎక్కడికి వెళ్తే అక్కడికి వెంటాడి వస్తాయి. అడవిలో కాదు ఆ కైలాసగిరిమీద తపస్సుచేసినా మనసులో ఆవేశించిన వాంఛలు వదలి పెట్టవు.

గోపా : వాంఛలు వదలి నిష్కామయోగం సాధించాలనే వచ్చాను.

విద్య : దానికి నిష్కామయోగానికి యింతదూరం ఎందుకూ ? అదంతా సరేకాని మీ కోరికలన్నీ తీరితే తపస్సు వుద్యమం మానుకుంటారా ?

గోపా : నాకోరికలు తీరటం యీ జన్మలో సాధ్యం కాదుకదా కలలో కూడా అది అసంభవం, అందుకనే యీజన్మ యిలాగడిచిపోతే వచ్చే జన్మలోఅయినా కొంతవరకు కోరిక ఫలిస్తుందేమోనని ఆశ.

విద్య : ఇప్పుడే కాదూ ఆశలు, కోరికలూ లేవన్నారు. పునర్జన్మ కోరితే యింకా మోక్షమేమిటి ?

గోపా : అంతగొప్పమోక్షం నాకెలాగ రాదని తెలుసు. కనీసం వచ్చే జన్మలోనైనా అదృష్టయోగం పట్టుందేమోనని. చూడండి, ఎన్ని యోగ్యతలుండీ ఏం లాభం అదృష్టం లేకపోయింతర్వాత.

విద్య : ఏమీటో చేతకాని వాళ్ళు అదృష్టంమీద భారంవేస్తారు. మీరు యోగ్యతలు — యోగ్యతలు అంటారు. ఏమిటి మీలోవున్న ప్రత్యేకత ?

గోపా : చెప్పానుకదూ ఫస్టుక్లాసు పట్టభద్రుణ్ణి.

విద్య : లోకంలో లక్షమందున్నారు. పట్టభద్రులు. ఏటా వేలకొద్దీ తయారవుతున్నారు, జీవితంలో పనికొచ్చే ఉపాయం తెల్సుకోలేకపోయింతర్వాత ఫస్టుక్లాసు ప్రయోజనం ?

గోపా : కవిత్వం చెప్తాను.

విద్య : అదొకఘనకార్యమా ? అదిచెప్పేవాళ్ళు చాలామందున్నారు. అయినా కవిత్వం చెప్తే కడుపు నిండుతుందా ?

గోపా : ఆమాటా నిజమేలెండి.

విద్య : మరింకేం విశేషం వుంది ?

గోపా : పెద్ద వ్యాపారం చెయ్యగల శక్తివుంది. కాని పెట్టుబడి......

విద్య : మీకు అందనివాటికోసం ఆశపడి ప్రయోజనం ఏముందీ ?

గోపా : అందుకే యిక లాభంలేదని లేచి చక్కావచ్చేశాను.

విద్య : అయితే మీకు ఏముంటే తృప్తికలుగుతోందో చెప్పలేదు.

గోపా : ప్రస్తుతం నాకేమున్నాయని. అన్నీ కావలసినవే. ముందు ఉండటానికి శుభ్రమైన యిల్లువుండాలి కదా ?

విద్య . చూడండి ఆ మలుపులో కనిపించే పాలరాతిమేడ మాదే అక్కడ వుంటారా ?

గోపా : మీవాళ్ళెవరూ ఏమీ అనరూ ?

విద్య : నా కెవళ్ళూలేరు. ఆమేడ నా స్వంతం. మీ యిష్టంవచ్చినంత స్వేచ్ఛగా వుపయోగించుకోవచ్చు.

గోపా : థాంక్సు మీరింత అభిమానంగా వుండమంటే కాదనలేను. కాని యీ నిర్జనస్థలంలో ఎంత అందమైన మేడయినా ఒంటరిగా వుండటమంటే కష్టంగానే వుంటుంది.

విద్య : మరి నిర్జనస్థలంలో ఒంటరిగా తపస్సు చేసుకోవాలని వచ్చారు.

గోపా : తపస్సుసంగతి లేదనుకోండి. తాదాగృహస్తుగా అంత అందమైన అద్దాలమేడలో వుండేటప్పుడు అన్నిహంగులూ గల నవనాగరిక ప్రదేశంలో వుండాలి.

విద్య : అయితే మీ యిష్టంవచ్చిన ఊరుకోరుకోండి. అక్కడే యిలాంటి అందమైన మేడ అన్ని హంగుల్తోను మీకు అమర్తుంది.

గోపా : అక్కడ మాసుబ్బులూ, మాఅబ్బాయి, పాపాయి, బోనిస్తురూ స్వర్గానికి పెళ్ళినా సవతిపోరన్నట్లు.

విద్య : మీశరీరంలో అర్ధభాగంఅయిన మీభార్యను, మీరక్తం పంచుకుని పుట్టిన మీబిడ్డల్ని అలాగంటారా ?

గోపా : చూడండి విద్యుల్లతగారూ, ఈ శరీరంలో జీవుడు వున్నంతకాలం వీళ్లు నా బిడ్డలు, నా భార్య, అకాస్తా వదిలిపెట్టిపోతే ఎవరికి ఎవరో, మంచికో చెడ్డకో సంసారం వదలిపెట్టి వచ్చేశాను, ఇంత వాళ్లెవరో. నే నెవర్నో.

విద్యు : ఎందుకింత విరక్తి.

గోపా : ఉన్నమాట దాచటం ఎందుకు ? మా అవిడ పూర్వకాలం మనిషి, దానితో కాపురం చెయ్యటమంటేనే విసుగెత్తింది.

విద్యు : చదువుకోలేదూ ?

గోపా : వానాకాలపు చదువు, ఎవరైనావస్తే వాళ్ళతో ఇంగ్లీషు మాట్లాట్టానికి, ఏ పార్టీలకైనా వెళ్తే అక్కడ ఖులాసాగా కాలక్షేపం చెయ్యడానికి, సినిమాలకీ వాటికీవెళ్తే అర్థంచేసుకోవటానికి ఏమీ రాదుకదా.

విద్యు : బోనీ సంగీతం వచ్చునేమో.

గోపా : చట్టుబండలు, కృతులురెండు పెళ్లినాడు నేర్చుకున్నవి కీచు గొంతుతో పాడుతుంది. ఏదైనా ఫంక్షన్‌పెట్టుకుంటే ఎంటర్టైన్ చెయ్యటం - కనీసం తెలుగు రేడియోలోనైనా పాడగల్గడం చేతకాదు.

విద్యు : ఇంటిపనులు బాగా చేతవునా ?

గోపా : ఏపన్లో ఏబ్రాసికి పనెక్కువని, నా ఆఫీసుగదిలో కుర్చీల్లో తన కట్టుచీరలు పడివుంటాయి. నా టేబిల్‌మీద పిల్లల పుస్తకాలూ, ఆటబొమ్మలూ, తన సూదులూ, దారాలూ......

విద్యు : కుట్టుపని చేస్తారేమో ?

గోపా : ఆ నా ప్రాణాలుతీసి రంగుదారాలు తెప్పించింది. రెండు నెల ల్నుంచీ కుట్టున్నది. యింతవరకూ ఒక్క తలగడగలీబైనా కాలేదు.

విద్యు : పోనీ వంటఅదీ బాగా చేస్తారా ?

గోపా : ఏంవంటో పోనిస్తురూ ? ఎప్పుడుచేసినా ఆ కొబ్బరికాయ పచ్చడే. ఆ పప్పుపులుసే, ఆ వంకాయకూరే.

విద్యు : మీచిత్రం మరీవి. పోనీ ముఖం కళగా వుంటుందా ?

గోపా : కళ ఎక్కడ్నుంచి వస్తుంది. వంటింట్లో పొగబారిపోయి మాసిన చీరతో, రేగిన జుట్టుతో పనులన్నీ ముగించుకుని స్నానంచేసి తెల్లని చీరకట్టుకుని వచ్చేటప్పటికి నేనొక కునుకుతీస్తూ వుంటాను.

విద్యు : మరిమీకిద్దరు పిల్లలన్నారు.

గోపా : అదిలోకధర్మం. ఏదితప్పుతుంది, గృహస్థుధర్మం నిత్యకృత్యంగా సాగిపోతూనే వుంటుంది.

విద్యు : ఇంతకీ మీకు మీ భార్యాబిడ్డలంటే యిష్టంలేదెందుకూ ?

గోపా : ఆమాట ఎలాగచెప్పను. మా ఆవిడకు కోపంవచ్చినప్పుడల్లా నన్ను దెప్పిపొడుస్తూనే వుంటుంది. నేను ఫలానా అమ్మాయిలాగా ఇంగ్లీషు మాట్లాడగలనా ? ఫలానావారి భార్యలాగ సంగీతం పాడగలనా ? ఫలానావారి కోడల్లాగా పెద్ద ఆస్తి తెచ్చానా ? ఫలానావారి ఆడపడుచులాగా మంచి వుద్యోగం యిప్పించానా ? మరోయింటి యిల్లాల్లాగా ఫలహారాలు అమర్చిపెట్టానా ? నేనెందుకు మరొకఆవిడను పెళ్ళిచేసుకోలేకపోయానా అంటుంది.

విద్యు : అవును యివన్నీ యిప్పటికాలపు నచ్చినభార్యల లక్షణాలు. అలా గంటే మీరేమంటారు.

గోపా : ఏమంటాను. సిగ్గుపడి నోరు మూసుకుంటాను. లోపల కుతకుత ఉడికిపోతాను. కేకలేస్తాను, కోప్పడ్తాను, ఒక్కోసారి ప్రాణం విసిగి కొడ్తాను.

విద్యు : మంచి ఘటికులే. భార్యమీద చెయ్యిచేసుకుంటారన్నమాట.

గోపా : ఒక్కసారి మాత్రం చెయ్యిచేసుకోక తప్పిందికాదు. ఒకసారి నామీద కోపంచేత పిల్లవాణ్ణి కొట్టింది. వెంటనే రెండువేశాను. మరోసారి మాటమీద మాటవచ్చి వాళ్ళ పుట్టింటివాళ్ళవి వెనకేసుకుని మావాళ్ళని తిట్టింది. ఇది పెళ్ళయిన కొత్తరోజుల్లో లెండి.

విద్యు : మీ భార్యమీద; సంసారంమీద యిష్టంలేకపోయినా యింతకాలం ఎలా కాలక్షేపం చేసుకుంటూవచ్చారు ?

గోపా : చూడండి విద్యుల్లతగారూ, మనుష్యుల జీవితం అలవాట్లమీద ఆధారపడి వుంటుంది. మొదటలో ఏ కొత్త అనుభవమయినా ఎబ్బెట్టుగా వుంటుంది. రానురాను అలవాటై పోతుంది. మన జీవితమే పొరపాట్లు, అలవాట్లున్నూ, మొదటపొరపాటు, తర్వాత దిద్దుపాటు ఆపైన అలవాటున్నూ.

విద్యు : అయితే మీకు సమస్త ఐశ్వర్యాలువస్తే తిరిగి కాపరంచెయ్యాలని లేదా ?

గోపా : వీళ్ళతోమాత్రం కాదు.

విద్యు : కొత్తకాపరం అయితే అభ్యంతరం లేదన్నమాట.

గోపా : కోరిన మరొక అమ్మాయితో.

విద్యు : అయితే స్వయంవరం చాటించమంటారా ?

గోపా : అక్కర లేదనుకోండి. ఇదివరకు నాకు తెలిసిన.......

విద్యు : మీరు ప్రేమించిన వాళ్లెవరైనా వున్నారా ?

గోపా : అవన్నీ జ్ఞాపకం చేసుకోవడం ఎందుకులెండి. నేను ప్రేమించిన ప్రక్కింటి లక్ష్మి సినిమాల్లోచేరి విద్యుల్లతయింది.

విద్యు : ఆవిడను పెళ్ళి చేసుకుంటారా ?

గోపా : ఎంతమాట ! ఆ సర్వసంపత్సమృద్ధితో భూలోకదేవతలాగ వున్న ఆ విద్యుల్లత ఎక్కడ ? ఈ చిన్నగుమాస్తా ఎక్కడ ?

విద్యు : మీరు గుమాస్తాగా వెళ్తారా ఏమిటి ? సమానహోదాతో మీరూ సమస్త ఐశ్వర్యాలూగల గృహస్తులాగా వెళ్తారు.

గోపా : పోనిస్తురూ నాలాంటి వాళ్ళెంతమంది అయ్యారో ? అంటే ప్రేమభిక్షకోరి వెనక్కు తిరిగి వచ్చారో ?

విద్యు : మీ పూర్వపరిచయం ఊరకేపోతుందా ?

గోపా : అదీ నిజమే కాని ఒక పెద్ద చిక్కొచ్చిపడింది. అవిడ కులం వేరు. మా కులంవేరు.

విద్యు : అటువంటి కులభేదాలున్నవారు మరి ప్రేమకలాపం ఎందుకు నడిపించారూ ?

గోపా : అప్పుడు చిన్నతనం వయసు ముమ్మరం. ఏవో పిచ్చిపిచ్చి ఆలోచన లుండేవి.

విద్యు : ఊ ( కథ ఎంతవరకు నడిపించారూ ?

గోపా : నాలుగైదు కావ్యాలు వ్రాయడంవరకు మాత్రమేలెండి.

విద్యు : ఇంతేనా యింకెవరైనా ప్రేమించినవా రున్నారా ?

గోపా : ఇంకోఅమ్మాయి వుంది.

విద్యు : ఆవిడ చదువుకుందా ?

గోపా : అన్నిలక్షణాలూ వున్నాయి.

విద్యు : ఆవిడతో పరిచయం ఎంతవరకు ?

గోపా : నేనావిడకు రోజూ రెండుగంటలు ప్రైవేటు చెప్పేవాణ్ణి ఆ అమ్మాయి దీపాలలాంటి తన కళ్ళతో నాకేసి చూస్తూ ఎన్నో ఆశలు పెట్టేది. ఆ పిల్లనుచూస్తే అన్నీ మరిచిపోయే వాణ్ణి. ఒక్క మా ప్రేమసంగతి తప్ప ఎన్నో మాట్లాడుకునే వాళ్ళం. జీవితం. సాధన, ఆదర్శం. ఆశయం ఎన్నో చెప్పుకునే

వాళ్ళం. ఆ అమ్మాయి నాతో మాట్లాడితే నాలో గొప్ప సామర్థ్యం గోచరించేది. మానవుడికి కావలసింది ఉత్సాహం. అలాంటి ఉత్సాహం కల్గించేవ్యక్తి ఒక్కరుకూడా లేకపోతే ఆ జీవితం నిరర్ధకం అనిపిస్తుంది. విద్యాదేవి నా కలాంటి ఉత్సాహాన్ని కల్గించింది, ఆ అమ్మాయి నన్ను పూర్తిగా అర్థంచేసుకుంది. నా అనుభవాలకు కొత్త మాధుర్యం కలిగించింది. అంతే. ఇంతలో ఎడబాటుకల్గింది.

విద్య : ఇంతేనా మరే ప్రేమగాధయినా మీ జీవితంలో వుందా ?

గోపా : ఇది ప్రేమగాధ అనటానికి వీలులేదు. మరో పరిచయస్తురాలు. తరుచు కలుసుకుని సినిమాలకు, బీచీలకు వెళ్ళేవాళ్ళం. ఎంత సన్నిహితంగా వున్నా ఆ అమ్మాయి దూరంగా వున్నట్టే వుండేది. రేడియో ప్రసంగాలు, బహిరంగసభలకు వుపన్యాసాలు ఇలాంటివి వ్రాసియిచ్చేవాణ్ణి. ఇప్పుడామె పెద్ద నాయకురాలు. రాబోయే ఎన్నికల్లో నిలిస్తే పార్లమెంటు మెంబరుకూడ అవుతుంది.

విద్య : ఇకనేం మీ కొత్త ఐశ్వర్యంతో ఆమెతో కాపురం పెట్టకూడదూ?

గోపా : వద్దు. ఆవిడతో కాపరం పగవాడికైనా వద్దు. అసలావిడ ఎవరితోనూ కాపరం చెయ్యలేదు. అందరిమీద ప్రభుత్వం చేస్తుంది.

విద్య : పోనీ వద్దు. మీకు పరిచితులయినవారిలో ఎవ్వరూ నచ్చకపోతే మీ రింతకాలం కలలుకంటూవున్న స్వప్నసుందరి ఎలాగుంటే బాగుంటుంది.

గోపా : సర్వసంపదలూ గలిగిన లక్ష్మీదేవై యుండాలి చాల అందంగా వుండాలి. పుస్తకాలూ అవీ చదవడం, సినిమాలుచూసి అర్థంచేసుకోవడం, ఏస్కూలు వార్షికోత్సవాలకైనా బహుమతులు పంచి పెట్టాలంటే ఉపన్యాసా లివ్వగల్గడం, ఏ రేడియోలోనైనా ఇంటి అందచందాలను గురించి, వంటయింటి రహస్యాలను గురించి మాట్లాడమంటే చెప్పడం యిలాంటివి చేతనవ్వాలి.

విద్యు : ఓ! అవన్నీ తప్పక చేతనవుతాయి.

గోపా : శాస్త్రనృత్యం, శాస్త్రగానం, శాస్త్ర చిత్రలేఖనం యివన్నీ.

విద్యు : శాస్త్రేమిటి. వీటిలో ప్రదర్శనాలు యివ్వగల్గినంత ప్రజ్ఞావిశేషాలుంటాయి.

గోపా : ఇన్ని లక్షణాలుగల యిల్లాలు దొరికితే ఆవిడతో అర్థక్షణం కాపరం చేసినా జన్మసార్థకమే.

విద్యు : మీరలాగే మననం చేసుకుని దీక్షగా భావించండి. అలాగే జరుగుతుంది. మీరు కోరినచోట కావలసిన లక్షణాలతో కూడిన అప్సరస లభిస్తుంది. అప్పుడేం చేస్తారో మరి!

# తీరని కోరికలు

## మూడవ రంగము.

[నే ప థ్యం లో]

కోరికలు గుఱ్ఱాలు, గుణములే చక్రాలు
లాగుచున్నావిధము, ఊగుచున్నది రథము
వేగ పగును ఎట్టి వధమో
ముందు కేగిన నూయి, క్రింద తూగినగోయి
ఎందుకలదో మంచిహోయి ॥

[తెర ఎత్తగా గోపాలం టిప్‌టాప్‌గా సోఫామీద కూర్చుంటాడు.]

గోపా : గురువులూ, గురువులూ ఎవరూ మాట్లాడరేంరా ?

గురువులు: చిత్తం బాబయ్యా.

గోపా : ఇందాకటినుంచి పిలుస్తుంటే ఎక్కడ చచ్చావు ?

గురు : ఇక్కడే వున్నానండి.

గోపా : ఇక్కడవుండే పిలిచినా పలుకలేదన్న మాట ఎంత కండకావరం.

గురు : చిత్తం బాబయ్యా.

గోపా : అస్తమానమూ ఏకచిత్తమే.

గురు : చిత్తం బాబయ్యా చెప్తున్నాకాదండీ. అమ్మగారికి ఫలహారం ఏర్పాటు చేస్తున్నానండి.

గోపా : మరలాగ చెప్పి అఘోరించవే.

గురు : అదే సెప్తున్నానండి.

గోపా : సరేలే. అమ్మగారెపుడొచ్చారు రాత్రి?

గురు : అసలు రాలేదండి.

గోపా : అసలు రాకుండా ఇపుడు ఫలహారం ఎలా చేస్తున్నారు రా ?

గురు : అదా ండి. యీయేళ తెలతెలారేడప్పటికి వచ్చారండి.

గోపా : డాన్సు ఎప్పుడో ఐపోతే ఇంతాసేపూ ఏం చేస్తున్నారట!

గురు : షూటింగుందటండి.

గోపా. నీముఖం అర్థరాత్రికాడ షూటింగేమిట్రా.

గురు : అయ్యబాబు మరి అర్ధరాత్రికాడే కాదండీ షూటింగు.

గోపా : ఏమిట్రోయ్ వెధవమాటలు.

గురు : అదికాదండి బాబు. స్టూడియోవాళ్ళకు చడీచప్పుడు లేకుండా, కాకులూ, పిట్టలూ అరవకుండా అర్థరాత్రికాడే యీలుగా వుంటాదటండీ.

గోపా : ఇంటికొచ్చి వెళ్లారా? అలాగ డాన్సు దగ్గరనుంచే వెళ్ళిపోయారా?

గురు : దాన్సు సందకాడే అయిపోయిందంటండి, అమ్మగారు యింటి క్కొచ్చి టిఫిన్ తీసికెళ్ళారండి.

గోపా. మరి, నన్ను పిలవలేదే?

గురు : తమరు క్లబ్బుకో ఎక్కడికో ఎల్లారుకదండీ.

గోపా : అదా! పోనీ స్టూడియోనించి తిరిగి వచ్చింతర్వాత నన్ను లేపలేక పోయావా ?

గురు : మీరు మంచినిద్దట్లో వున్నారండి. ఇంకా ఎలాగా తెల్లారిపోయింది గందాని అమ్మగారే లేపొద్దన్నారండి.

గోపా : సరేలే చూడు ఎవరో వచ్చినట్టుగా వున్నారు. వీధిలోకి వెళ్ళి తలుపుతియ్. తెల్లారడం భయం యీగలు ముసిరినట్టు వాల్తారు.

యీ అడ్డమైన వాఖ్యానూ ఒక్క క్షణం స్తిమితంగా కూర్చోవా లంటే లేదుకదా,

[ఒంటరిగా పడకకుర్చీలో వాల్తాడు. మాటలు వినిపిస్తాయి ఎవరో అంటున్నట్టు]

ఫిల్మ్‌స్టారు భర్తఅయితే సరా, మానాభిమానాలు లేక పోయింతర్వాత. పెళ్ళిఅనేది వుంటేసరి అన్నిటికి ఫ్రీపాస్.

గోపా: (ఏదో దులిపేస్తున్నట్టు లేస్తాడు) ఎవర్రా అది?

గురు: చిత్తం ఈరేదో సబ్బు బిళ్ళలమ్ముతారటండీ.

గోపా: సబ్బుబిళ్ళలు మనకెందుకు? కావలసినన్ని యింట్లో పడుంటే

ఏజంటు: గుడ్ మార్నింగ్‌సార్.

గోపా: గుడ్ మార్నింగ్.

ఏజం: మేము రోజాటాయిలెట్ సబ్బు ఏజంట్లమండి. నాపేరు **Mr Juler.** అంటారు. టా టా...

గోపా: అయితే ఏంచెయ్యమంటారు. ప్రస్తుతం మాకు సబ్బులు అక్కరలేదే.

ఏజం: సబ్బులు **Samples** తీసికొచ్చామండి. ఇవిఫ్రీగానే వాడొచ్చు అమ్మగారూ....టా....టా...

గోపా: టాటా ఏమిటి?

ఏజం: అదేసార్ టా ...టా నిన్నస్టూడియోలో మీటయ్యాను. మా కంపెనీ తరపున వేస్తున్న **Advertisements** లో అమ్మగారు సంతకంపెట్టి తమపిక్చర్ వెయ్యటానికి ఒప్పుకున్నారు సార్.

గోపా: ఒప్పుకుంటే యింకెందుకు?

ఏజం: దాంతోపాటు ఒక సర్టిఫికెట్ కూడా వ్రాస్తామన్నారు సార్ టాటా.

గోపా: అమ్మగారు అటువంటివేమీ వ్రాయరు.

ఏజం : అంటేఅది మేమే వ్రాశాం సార్. అమ్మగారి పేరున ప్రకటించ టానికి సంతకంపెత్తే చాలుసార్. టాటా...

గోపా : మీ అడ్వర్టయిజ్ మెంట్లు, పిక్చర్లు యిలాగ వేశేవేనా ఏమిటి ? మీ నబ్బు యీవిడ చూడలేదు. వాడలేదు ఏమని సర్టిఫికెట్ యిస్తుంది అంతా మోసం.

ఏజం : ఇందులో మోసం ఏముందండిసార్. దేవిగారితో అగ్రిమెంటు అయింది. అయిదువేల రూపాయిలకు కంట్రాక్టుసార్. టాటా...

పబ్లిక్ గా అన్ని పేపర్లలోను మూడు రంగుల బొమ్మతోసహా ప్రకటనచేస్తూవుంటే మోసం ఏమిటండీ సార్... టాటా-అంతే.

గోపా : అయిదువేలు కాదు. ఏభై వేలిచ్చినా సరే యీ అగ్రిమెంటు నా కిష్టంలేదు.

ఏజం : అమ్మగారికిష్టమేనండి సార్.

గురు : నబ్బులమ్మె ఏజంటు గారటమ్మా.

ఎజం : నమస్కారమమ్మా - టాటా ...

విద్యు : మీరేనా సోమయాజులుగారు.

ఏజం : Mr. Juler. నిన్న విక్టోరియాహాలులో మీడాన్సు చూశానండి. ఎక్కడకువెళ్లినా అడాన్సుమాట చెప్పుకుంటున్నారు. ట-టా ... Madam Pavlove మీ అవతారం ఎత్తివచ్చిందంటున్నారు.

విద్యు : అలాగా.

ఏజం : మా దొరగారుకూడా వచ్చారు. ఆయన చాలా please అయి పోయి సరాసరి మీస్టూడియోకి వచ్చేశారు.

విద్యు : అవును. అక్కడ కలుసుకున్నాను. అగ్రిమెంటు తయారు చేశారా?

ఏజం : ఇదిగోనండి. అన్నీ రెడీ. ట - టా...

విద్యు : ఏమని ప్రకటన చేస్తారు పత్రికల్లో

ఏజం : చూడండి. (అని కాగితం అందిస్తాడు.)

విద్యు : నేను మూడు సంవత్సరాలనుంచీ యీ రోజాసబ్బు వాడు తున్నాను. ఈ సబ్బువాడటంవల్ల నాచర్మానికి మృదుత్వం, ముఖానికి మెరుగు కలిగింది. దీని సువాసన ఎంతో యింపుగా వుంటుంది.

ఏజం : అంతే దానికింద పేరు సంతకంపెట్టడమే.

గోపా : అసంభవం. ఈ సంతకం చెయ్యను. ఇలాంటి అబద్ధ ప్రకటనల మీద మవ్వు సంతకం పెట్టటానికి నామనస్సు ఒప్పటంలేదు లతా!

విద్యు : ఎందుకండి. మీకంత కోపం, తీరామోసి నిన్నవాళ్ళు దొరవచ్చి అగ్రిమెంటు స్థిరపరచివెళ్లాడు. ఇప్పుడు కాదంటే బాగుంటుందా?

గోపా : ఇంక అడ్డమైన పత్రికలలోను యీ తుక్కు సబ్బును గురించి అవకతవక బొగడ్తఅచ్చు అవడం ఎంత అసహ్యం.

ఏజం : అదేమిటండీ సార్ ఫిలిమ్ స్టార్సు అందరూ మా సబ్బును పొగి డారు సార్, విద్యుల్లతాదేవిగారు కొత్తస్టార్. అయినాసరే మా కంపెనీ స్వంతఖర్చుమీత బ్రహ్మాండమైన ప్రకటనలతో ఆవిడ పిక్చర్ అన్ని ప్రతికల్లోనూ వేయిస్తున్నాం, ఎంతఆడ్వర్టయిజ్ మెంటు.

గోపా : మాకు యిటువంటి పబ్లిసిటి ఏమీవద్దు.

విద్యు : ఇప్పుడు వద్దంటే ఎలాగ? అన్నీ అయిపోయిన తర్వాత

ఏజం : ఈ అగ్రిమెంటుమీద సంతకం అయిన వెంటనే రు 5,000 లకు చెక్కు అందచేస్తాను సార్. అంతారెడీసార్.

విద్యు : మనం బాకీవున్న మోటారుబిల్లు ఆవిధంగా సరిపెట్టుకోవచ్చు.

గోపా : సరే అలాగయితే నీయిష్టం.

విద్యు : ఏవండీ ఆ కాగితాలు?

ఏజం : ఇదిగోనండి, ఇక్కడ ఒక సంతకం. ఇక్కడ ఒకటి-ట టా

విద్యు : (సంతకం పెట్టి) సరేనా.

ఏజం : రైట్... టా-టా....

(5)

విద్యు : ఇంతేకదూ,

ఎజం : ఇదిగో మీచెక్కు Thanks సార్ టటా (వెళ్లాడు)

విద్యు : Thanks ట - టా...

గోపా : ఇకమీదటనుంచీ అన్ని చెత్త పత్రికల్లోనూ ఫలానాసబ్బు భేషుగ్గా వుందని నీ బొమ్మతోసహాసాక్షి వ్రాలు Cheap Publcity...

విద్యు : ఇదివరకు అన్నిపత్రికలలోనూ అనేక విధాలుగా అచ్చుపడగా లేనిది యీ సబ్బు ప్రకటనతోపాటు మన ఫొటోపడితే లోటు వచ్చిందా ?

గోపా : లోటనికాదు. నీవాసబ్బు వాడలేదు. చూడలేదు. బాగుందని సర్టిఫికెట్ ఎలాగిచ్చావు. నీ మాటనమ్మి ఎంతమంది అమ్మాయిలు వాళ్ళ భర్తల దుంపతెంచి యీ సబ్బు కొనిపిస్తారూ.

విద్యు : మిమ్మల్ని ఏ అమ్మాయి యిబ్బంది పెట్టదు సరేనా.

గోపా : అదికాదు లతా. ఇలాంటి అప్రాచ్యపు పనులు చెయ్యటానికి నువ్వెలాగ ఒప్పుకోగల్గు తున్నావని ?

విద్యు : ఏంచెయ్యాను. మీరేకదూ డాన్సుచెయ్యాలి సినిమాస్టారు నవ్వాలి అని కూర్చున్నాట. తీరా అందులోకి దిగింతర్వాత ఇలాంటి అప్రాచ్యపు పనులు ఎన్నైనా చెయ్యాలి,

గోపా : ఇది చెయ్యకపోతే మనకిలోటు కలగుతుందా?

విద్యు : లోటనికాదు, పేరున్న పెద్దస్టార్లంతా సంతకం పెట్టారు. మీరు కూడ యీ సబ్బు అడ్వర్టయిజ్మెంటు మీద సంతకంపెట్టండి. అని మా డైరెక్టర్ చెప్పాడు. అందరు స్టారులుచేసిందీ మనమూ చెయ్యకపోతే మన పబ్లిసిటీకి భంగం అన్నారు. బంతిలో బాలపాప అయితే మీరే చిన్నపుచ్చుతుంటారు. ఇవన్నీ మిమ్మల్ని ఆనందపెట్టడానికితప్ప నాకు కావాలాఏమిటి ?

గోపా : నన్ను ఆనందపెట్టడానికి రాత్రింబగళ్ళు షూటింగు, రిహార్సులు, డాన్సులు, అవకతవకపనులూ, అన్నినీ.

విద్యు : తప్పుతుందామరి. తీరామాటయిచ్చిన తర్వాతఅన్నీ భరించాలి, రాత్రి తెల్లవార్లూ ఆర్లైట్లవెలుగులో చేసిందేచెయ్యటం ఏమంత సుఖమని, ఛిఛీబాధ పగవాళ్ళకయినావద్దు. సినిమాస్టారు జీవిత మంతే ఒక్క మెరుపుమెరిసి వెళ్ళిపోవడం అనుకుంటారు కాని నిజానికి ఆఒక్క క్షణం మెరుపుమెరిపించడానికీ ఎన్ని అహో రాత్రాలు నిలువు ఖైదుచెయ్యాలో.

గోపా : అయితే ఎందుకీ కష్టాలన్నీ మానివేద్దాం.

విద్యు : అదిమాత్రం అంత సులభమా? తీరా మన తల దూర్చిన తర్వాత అంత సులభంగా యీ బాధల్లోంచి తప్పించుకురాగలమా?

గురు : ఎవరో పత్రిక ఎడిటరుగారటండీ వచ్చికూర్చున్నారు.

గోపా : ఇంకా వీళ్ళొకళ్లు తెల్లారిలేస్తే వూరకుక్కల్లాగ వెంటపడ్తారు.

విద్యు : ఈయన 'విచిత్రం' ఎడిటరు అయివుంటాడు. నేనే రమ్మన్నాను లెండి. లోపలికి రమ్మను గురవులు.

గోపా : విచిత్రమోన చిత్రమో పుట్టగొడుగుల్లాగ అన్నీ పత్రికలే.

ఎడిటరు : నమస్తే విద్యుల్లతాదేవిగారూ నమస్తేఅండి.

విద్యు : నమస్తే, రండి కూర్చోండి. యీయనేనండి విచిత్రం ఎడిటరు హనుమాన్లుగారు.

హనుమాన్లు : **Very glad to meet you Sir,** గోపాలంగారని తమ పేరు వినడమేకాని ఎక్కడా తమదర్శనభాగ్యం కలగలేదు. ఇన్నాళ్ళకి విద్యుల్లలాదేవిగారి పుణ్యమాఅంటూ ఆ కోరిక సిద్ధించింది. చాల సంతోషం.

గోపా : మీపత్రిక నేనెప్పుడూ చూడలేదండి.

హను : తెలుగు సినిమాప్రపంచంలో అఖండ ప్రచారం గలది మాపత్రిక ఒక్కటేనండి. మేం వేసేతారల జీవిత చరిత్రలు, పాఠకుల ప్రశ్నలకు జవాబులు చాల **Populor** లెండి.

గోపా : అలాగా, మీరిక్కడకు వచ్చిన పని.

విద్యు : నేనే పిలిచాను లెండి.

హను : మనవి చేస్తున్నాకదండి. విద్యుల్లతాదేవిగారి త్రివర్ణచిత్రంవేయించి తీసుకొచ్చాను. రాబోయే Issue మేము జన్మదిన సంచికగా తయారు చెయ్యాలని చూస్తున్నాం. అందులో విద్యుల్లతాదేవిగారి జీవిత విశేషాలు, గృహస్థజీవితం, interview యివన్నీ వేస్తాం.

గోపా : భేష్! బాగానేవుంది. యింటిగుట్టుంతా రచ్చకెక్కిస్తారన్నమాట?

హను : ఈ బొమ్మలు చూశారా?

విద్యు : బాగుందండి. రంగులు చక్కగా సరిపోయాయి.

గోపా : ఏమో మాలతలాగు మాత్రంలేదు.

హను : చూడండి గోపాలంగారూ! మీకు రోజూ కనిపించేది మీ యిల్లాలు లత మాకూ, మా పాఠకులకూ, ప్రేక్షకులకూ కావాలసింది. ఫిలిమ్‌స్టార్. glamarous girl విద్యుల్లతాదేవి.

విద్యు : ఏమండీ హనుమాన్లుగారూ మావారి ఫోటో వేయిస్తామన్నారు.

హను : అవునమ్మా అఫోటో తియ్యటంబ్లాకుచెయ్యడం యిదివరకే జరిగాయి. కాని మీయిద్దరిలో నేనుకూడ కూర్చుంది విద్యుల్లతతో అరగంట అని వేయిస్తాను.

గోపా : నన్నుకూడ వీధిలోకి యీడ్వటం ఎందుకు యిలావుండనీయండి.

హను : మీకేమిటండీ నిక్షేపరాయుడిలాగా వున్నారు. వాళ్ళు వీళ్ళలాగ అప్రయోజకులు గారు. ఫస్టుక్లాసు గ్రాడ్యుయేటు. స్ఫురద్రూపి. నిండైన విగ్రహం. విద్యుల్లతాదేవికి మీరన్ని విధాలా తగిన వరులు. మీరు సిగ్గుపడవలసింది దేనికి? మీకు మిగతా తారల భర్తల్లాగ దుర్వ్యసనాలు లేవు. వేట, జూదం, పానం....

గోపా : హనుమాన్లుగారు మంచిమాటలు నేర్చారు.

హను : మాటలమ్మి జీవించడమే కదండీ మావృత్తి.

విద్యు : బాగా చెప్పారు. సరే మీరేం వ్రాస్తారో చెప్పండి.

హను : వచ్చేనెల పత్రికచూచి అడగండి. రేపుమా Staff plotographer ని పంపిస్తాను. actions hots కొన్ని తీస్తాడు.

విద్యు : ఇవ్వాళ తీసినవి చాలవా?

హను : Action Shots అంటే దినచర్యలోవిలెండి. ప్రొద్దున్నే ఫలహారం చేస్తున్నట్టు.

విద్యు : అందులో విశేషం ఏముంది?

హను : అంటే విద్యుల్లతగారు ఉత్తమ యిల్లాలు. ఫలహారం స్వయంగా తయారు చేస్తారన్నట్టు పెసరట్టు పేనంమీద వేస్తున్నట్టు చూపాలి,

గోపా : అవును. యీవిడ ఎపుడు పెసరట్టువేసినా మాడిపోతాయి గనుక మంచి advertisement చెయ్యాల్సిందే.

హను : తర్వాత తులసికోటదగ్గిర పూజచేస్తున్నట్టు.

విద్యు : సినిమాల్లోతప్ప నేనెపుడూ తులసిపూజ చెయ్యనండి.

హను : మీరు వేసేవి పతివ్రతల పాత్రలు. వాళ్ళపాటపాడుతూ తులసిపూజచేస్తూవుంటారు. మీ యదార్ధజీవితంలోకూడ దైవభక్తిచూపడంకోసం అదొకటి అవసరం తర్వాత సంగీత పాఠాలు. వీణ వాయిస్తున్నట్టు ఒక ఫొటో.

విద్యు : నాకు వీణవాయించటం చేతకాదండి.

హను : చేతకాకపోవడమేమిటి, అవన్నీ మాకు వదిలెయ్యండి. తర్వాత మీ నృత్యంపోజు. అవి మాదగ్గరున్నాయి లెండి. ఇంక మధ్యాహ్నం సోఫామీద కూర్చుండి హిందీ పుస్తకాలు చదువుతూవున్నట్లు ఒకటి.

గోపా : హిందీ అసలు రానందుకు అలావేస్తే మరీబాగుంటుంది.

హను : ఇప్పుడు తీయబోయేచిత్రాలన్నీ డబుల్, ట్రిబుల్ వర్షన్సు కాదండి అందుకు ఆవిడ హిందీపుస్తకం చదువుతున్నట్టు వేస్తే అసౌకమజా కాకపోయినా హిందీ మనరాష్ట్రభాష.

గోపా : దేవిగారి దేశభక్తికి అదొక ఉదాహరణంఅంటారు.

హను : బాగా చెప్పారు, మొట్టమొదకారు స్వయంగా నడుపుతున్నట్టు ఒక ఫోజు. దేవిగార్లు మొన్న కాంచీపురం Excursion వెళ్ళినప్పుడు గంటకు 70 మైళ్ళ స్పీడుతో Dash చేసినట్టు వ్రాసాను.

గోపా : మొన్నవీళ్ళంతా వెళ్ళింది Eletric Train లో వచ్చి అబద్ధాలు మీ వ్రాతలన్నీ.

విద్య : అదీ తమాషాగానే వుంది. కొన్నాళ్ళపాటు జనం అంతా విడ్డూరంగా చెప్పుకున్నారు.

గోపా : అదొకవెర్రి Sensation.

హను : చూడండి గోపాలంగారు. ప్రజలు, ప్రేక్షకులు, పాఠకులు మామూలు దిన దిన స్తబ్దజీవితం గడుపుకుంటూ పోతూ వుంటారు. వాళ్ళకి ఏదోవేడి పుట్టించాలి. అబద్ధం అవనీయండి సుబద్ధం అవనీయ ది వాళ్ళని రెచ్చకొట్టే Sensation కలిగించాలి. వేటకుక్క చూడండి తిండిబెట్టి కూర్చోపెడ్తే కునుకుపాట్లు పడుతుంది. ఏదైన చూపించి రెచ్చకొట్టి ఉసిగొల్పితె ఎగరేసుకుని పోతుంది. సామాన్యజనంఒక్కొక్కడిలో ఒక్కొక్క వేటకుక్క నిద్రపోతూవుంటుంది.

విద్య : బాగాచెప్పారు ఆదే వేలంవెర్రి.

హను : ఆవెర్రి ఎక్కించే వరకే. ఆకాస్తవెర్రి ఎక్కించి వదిలెయ్యడమె మాపత్రికల వాళ్ళపని. ఇకతర్వాత చూసుకోండి.

విద్య : ఇంకేమన్నావేస్తారా? అంతేనా?

హను : భర్తగారితో సాయంకాలం మీ తోటలో షికారు వెళ్తూవున్నట్టు ఒకటి.

గోపా : అదే అబ్బురం అయిపోయింది. ఒక్కరోజుకూడ యింటిపట్టున వున్నదేదీ?

హను : తర్వాత మీ హాబీస్‌లో మొక్కలకు నీళ్ళు పొయ్యడం. గుఱ్ఱపు స్వారీ చెయ్యడం, పిల్లల్ని ఆడించడం.

గోపా : మొక్కలకు మా యింట్లో బెత్తెడు స్థలంకూడ లేదు.

విద్యు : క్రోటన్సు కుండీలున్నయ్ కదండీ.

గోపా : గుఱ్ఱపుస్వారీ అంటారే కుదుటుగా మోటారుకారులో కూర్చుండి కొంచెం స్పీడుగావెళ్తేనే హడలిపోతుంది. ఇంక గుఱ్ఱపుస్వారీ కూడ చేస్తుందీ.

విద్యు : గుఱ్ఱపుస్వారీ నాకు సరదాయే లెండి.

గోపా : తెల్లగుఱ్ఱపుస్వారీ యేనా ?

విద్యు : Prohibition రోజుల్లో అలాంటి మాటలనకూడదు.

హను : ముఖ్యంగా పత్రికల వాళ్ళెదుట.

విద్యు : సరేగాని పిల్లలు లేనిదే పిల్లల్ని ఆడించడమేమిటండీ.

గోపా . Inanticipation .. రాబోయే చిత్రాలు.

హను : పిల్లలు మీస్వంతం వుండనక్కరలేదు. ఇరుగు పొరుగువాళ్ళ పిల్లల్నిగాని, ఆవిడ అక్కచెల్లెళ్ళ పిల్లల్నిగాని ఆడిస్తూవున్నట్టు వేస్తే ఈవిడకు మాతృహృదయంవున్నదన్న పాయింటు రుజువు చెయ్యొచ్చు.

విద్యు : భేష్, మీయిష్టంవచ్చినట్టు చెయ్యండి.

గోపా : గురుపులూ కూల్‌డ్రింక్సు తీసుకొవిరా.

హను : Thanks సార్ ఇకవెళ్తానండి, ఇప్పుడు వృశ్చికవాళ్ళస్టూడియోకి వెళ్లాలి, ఏవోకొన్ని స్టిల్సు, బ్లాకు యిస్తామన్నారు.

విద్యు : ఇవిగో డ్రింక్సు వచ్చేశాయి, గురువులూ.

హను : ఆ అన్నట్టు మీరు రేడియో వింటున్నట్టు ఒక ఫొటో వేస్తానండీ.

విద్యు : నాకసలు రేడియో అంటేనే తలనొప్పి.

హను : కాదులెండి మీరు సంగీతం అంటే చెవికోసుకుంటారని చెప్పడం కోసం రేడియో వింటున్నట్టు ఒక పోజు వేస్తాం మాదగ్గరకు ఒక కొత్తమోడల్ రేడియోవచ్చింది. అది వేస్తున్నట్టు కూర్చోండేం.

గోపా : ఆ రేడియోకంపెనీవాళ్లు మీ కేమైనా కమీషన్ యిచ్చారా ?

విద్యు : కమీషన్ ఏమిటి? ఒకపెద్ద రేడియోనే బహుమానంచేశారు.

గోపా : అదా సంగతి **Two birds at one shot**

హను : ఏదో మరి. రెండు పిట్టలేమిటి? వీలైతేదెబ్బకు ఎన్నిపిట్టలైనా కొట్టాలి. ఇపుడు మాపత్రికలవాళ్ళదిరోజు **Make way while Sun shines.** ఈమోజువున్నంత కాలమేమరి.

విద్యు : మంచిపని చేస్తున్నారు. అన్నట్టు ప్రశ్నలకు జవాబుఅన్నారు.

హను : మరేనండి, అది యీ నెలకాదులెండి. వచ్చేనెల సంచికలో వెయ్యొచ్చు. ఈనెల **announcement** చేస్తాం పాఠకుల ప్రశ్నలకు ఫలానా విద్యులతాదేవిగారు ప్రత్యుత్తరాలు యిస్తారని.

విద్యు : అలాంటి జవాబులు వ్రాయడం నాకు చేతకాదే.

హను : అవన్నీ మేంచూసుకుంటాంలెండి. ఉత్తరాలు, జవాబులూ అన్నీ మేమే తయారుచేస్తాం.

గోపా : అలాగా అయితే మీ పత్రికల్లో ప్రకటించే ప్రశ్నలూ జవాబులూ అన్నీ యిలాంటి వేనా ?

హను : అది **Trade secret** మీరడగ కూడదు. మేం చెప్పకూడదు.

(ఇంతలో డైరెక్టరు శివశంకర్, ప్రొడ్యూసరు కదిరప్పచెట్టియారు కారులో దిగి ప్రవేశిస్తారు. గురువులు దారి చూపుతాడు)

గోపా : ఎవరది ?

విద్యు : డైరెక్టరు శివశంకర్ అనుకుంటాను. ఆమోహినీ సినీటోన్ వాళ్ళ ప్రొడ్యూసరు కదిరప్ప చెట్టియారును తీసుకొని వస్తానన్నారు. వాళ్ళే వచ్చినట్టుగా వున్నారు.

హను : గుడ్ మార్నింగ్ సార్, నమస్కారం సార్.

శివశంకర్ : గుడ్ మార్నింగ్ మీరిప్పుడే వస్తున్నారా ? గుడ్ మార్నింగ్ అతా!

విద్య : గుడ్ మార్నింగ్ రండి. నమస్కారమండీ చెట్టిగారూ!

శివ : వారు మీకు తెలుసుకదూ మోహినీ సినీటోన్ ప్రొప్రయిటర్ కదిరప్పచెట్టియార్.

విద్య : అవును రత్నహారం షూటింగులో మోహినీ స్టూడియోస్‌లో చూశాను. పరిచయం చెయ్యండి.

కదిరప్ప : రొంబ సంతోషం.

విద్య : వీరు మావారు తెలుసుకదూ.

హను : **Mr. Gopalam**

గోపా : **Very glad to meet you. Shake hands.**

కది : రొంబ సంతోషం.

హను : నేను వస్తానండి. అందరి దగ్గరా సెలవు.

శివ . చీరియో,

విద్య : వెళ్లిరండి.

శివ : చెట్టియారుగారు యిప్పుడు ఒకపెద్ద **Production** తలపెట్టారండీ. అది హిందీ, తెలుగు, తమిళభాషల్లో తీసి ఒకేసారిదేశం మీద వెదజల్లాలని చూస్తున్నారు,

కది : ఆమాసార్,

విద్య : ఆ పిక్చర్ ఏమి టన్నారూ?

శివ : జాంబవతీ పరిణయం.

గోపా : అంటే పురాణగాధన్నమాట **Mythological Subjects.**

శివ : అంటేపూర్తిగా **mythology** కాదండీ ఇందులో **folklore** జానపదచిత్రం కూడా వుంది.

గోపా : ఇందులోకూడ గుహలూ, ద్వారాలు, యక్షితలు, దేవతలూ, దయ్యాలు, పాముపడగలూ...

శివ : భేషుగ్గా వుంటాయి, దీని treetment కొత్తపద్ధతిలో ఏర్పాటు చేశామండి.

కది : అమాసార్ ఇందిలో నమ్మజాంబవాన్ తని సమాచారం

శివ : అదే సర్ మనతెలుగు సినిమాఫీల్డులో ఎలుగుబంటికున్న పలుకుబడి దేనికిలేదు. ఇందులో కధానాయిక ఆడ ఎలుగుబంటి భల్లూక రాణి అన్నమాట.

విద్యు : నన్నాభల్లూక వేషం వెయ్యమంటారా ఏమిటి ఖర్మం.

కది : నీంగళ్ Heroine దా

శివ : మన విద్యుల్లత Title role జాంబవతీవేషం వెయ్యాలి. ఇది Through outఉంటుందిలెండి. మూడుడ్యాన్సెస్. ఆరుపాటలు. మంచి ప్లేబాకు ఏర్పాటు చేస్తున్నాలెండి,

గోపా : Play back ఎందుకు? మాలతి తనంతట తానే పాడుతుంది.

విద్యు : ఎందుకు? ప్రొడ్యూసరు యిష్టం వచ్చినట్టు చేసుకుంటాడు, ఎలా చేస్తే రెండు డబ్బులు ఎక్కువ వస్తయ్యో అలాచేస్తాడు.

కది : రొంబసరి

గోపా : అయితే యీ Subject ఎలావుంటుంది,

శివ : Subject aron గాఉంటుందిలెండి. ఇందులో finger flute వెర్రివెంకయ్యగారిని శ్రీ కృష్ణుడు గా Book చేశాం. ఆయన స్వయంగా ఈలపాటపాడ్తారు.

విద్యు : సరేగాని జాంబవతికి అసలు స్టోరీలో అర్థం లేదె.

శివ : మా Story లో జాంబవతి పెద్ద అప్సరస. ఇంద్రసభలో నాట్యం చేస్తూవుంటే శాపంవల్ల భూలోకంలో జాంబవతి అయి జన్మిస్తుంది. శ్యమంతకమణి గాథ. అదొక రాజు అపహరించడం చాలా కథ ఉందిలే.

గోపా : అవునులెండి మీకు కావలసిన కొత్తమార్పులు చేసుకుంటారు.

శివ : అసలు Original కీ దీనికీ ఏమీ పోలిక ఉండదులెండి.

విద్య : కామిక్ ఏమన్నా పెట్టారా ?

కది : మాష్టర్ గిడి గిడీని కామిక్ కోసం బుక్ చేస్తిమి.

శివ : అతనికితోడు పళ్యాం పుళ్యాం అని మరిరెండు కామిక్ పాత్రలు పెట్టాం. దాంతో కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వే సన్నివేశాలు!

విద్య : భేష్ బాగుంది!

గోపా : సరే మా లతకు అభ్యంతరంవుండదనుకోండి ఇక టరమ్సు విషయం ఆలోచించండి.

విద్య : Terms సంగతి చెట్టియార్ గారికి తెలియదా ! శివశంకర్‌గారికి తెలియదా ! ఇందులో క్రొత్తేముంది. ?

శివ : చెట్టియార్‌గారు వాళ్ళు వీళ్ళలాంటి మనిషికాడు Cash Down మనిషి ఇదివరకిచ్చినట్టె ముప్ఫై వేలిస్తారు.

విద్య : మూడు పిక్చర్సులో act చెయ్యాడానికా ?

కది : మూడు పిక్చర్సు అన్నాక ఒన్నుదానే తమిళ, హిందీ, వర్షన్సు దానే. ఒరే ఒరు పడమ్.

గోపా : అదేమన్నమాట, మీకు మూడు పిక్చర్సుద్వారా రాబడిరాదా ?

కది : ఉంగళెకి వేల ఒన్నుదానే జాస్తివేల కడియాదు.

శివ : అవును. శమేముంటుంది. అన్ని వర్షన్సు ఒకేసారి షూటింగు.

విద్య : అయితే మరి శ్రమకాదూ మీరు చెప్పినట్లు ముప్ఫైవేలు మూడు పిక్చర్సుకు వేరువేరుగా యివ్వండి.

గోపా : అంతే మరి ఒక్క తెలుగుపిక్చరుకె 50,000 యిస్తామంటున్నారు.

శివ : ఆ లెఖ వేరు. యీ దెబ్బతో మన లత అలిండియాస్టారు అవుతుంది, అది జ్ఞాపకం వుంచుకోండి.

విద్య : ఏ స్టారయినా యీ రెండుమూడు పిక్చర్సులోనే కాదండి. తర్వాత మమ్మల్ని పలకరించే వాళ్ళుకూడా వుండరు.

కది : అప్పడి యిరిక్కాదు మీనమాఛారం షేరుధా.

విద్యు : పేరు సమాచారం అంటాడు గాని సొమ్ము యిచ్చేటప్పుడు అందరూ ఒకటే.

శివ : మీరు ఆలస్యం చెయ్యకుండా అగ్రిమెంటుమీద సంతకం పెడితే హిందీ పిక్చరు డిస్ట్రిబ్యూటరు సేట్ ఝుం ఝుం వాలా ఇంపీరియల్ హోటలులో వున్నాడు. అయనతో మీకు Engagements fix-up చేశాం.

గోపా : ఆ డిస్ట్రిబ్యూటరుతో మాకేంపని.

శివ : ఏం లేదులెండి అమ్మాయిని స్వయంగా చూస్తే వాడికి ధైర్యం.

విద్యు : అయితే యీ Engagements నాతో చెప్పకుండా ఎందుకు fix-up చేశారు.

కది : పుదు సమాచారం ఒన్నుమిళ్ళే. సింగళ్ సమ్మతిదానే.

విద్యు : అయితే యిదొక పుదుసమాచారం కాబట్టి అగ్రిమెంటులో లక్ష రూపాయిలు పూర్తిచెయ్యండి.

కది : అదెన్న తింప్పి కణక్కు—జాస్తి అవుదే.

విద్యు : నేలకూడ జాస్తిచేశారు.

శివ : ఆ ఎంగేజ్‌మెంటు ఒప్పుకొనితీరాలి.

విద్యు. పూరాగా ఒక లక్షకు అగ్రిమెంటువ్రాయండి.

గోపా : పదివేలు Income tax తో అగ్రిమెంటు. మిగతాది లోపాయికారీ Agrement.

కది : అది సరిదా.

శివ : ఎన్నసార్. సరేననండి, మన ఆర్టిస్టుపూర్తిగా సంతోషిస్తేవాళ్ళ వల్లమనం మనస్ఫూర్తిగా సహకారంపొందొచ్చు Maximum Work తీసుకోవచ్చు.

విద్యు : అంతేమరి. సరేననండి చెట్టియారుగారూ,

కది : సింగళ్ అంద మాదిరి సొన్నాక,

శివ : రైట్.

కది : అగ్రిమెంటు అదెల్లా Hotel Imperialలోదా జరుగును, మీరు అంగెదా పూడ్చి సంతకందా చేసేది.

విద్య : సరి అలాగేచేస్తాను.

శివ : అక్కడ సేట్ గారుకూడ చూస్తారు.

కది : మీరుతప్పక వస్తురుగా.

విద్య : ఓ

శివ : ఈ సాయంకాలం సరిగ్గా 8-30 మా కారు వస్తుంది.

విద్య : ఎందుకు మాకారుందిగా అన్నట్టు ఏమండీ మీరు ఆసమయానికి క్లబ్బుకి వెళ్తారేమో

గోపా : ఏ ప్పు రమ్మంటేకూడ వస్తాను.

విద్య : ఓ ఏ క్లబ్బు వదలిరావడం ఎందుకులెండి. అయితే మీ కారే పంపండి,

శివ : మా స్టూడిబేకర్ వచ్చి Pick upచేస్తుంది.

కది : నేనుదా వస్తును.

విద్య : మీకెందుకులెండి అశ్రమ.

కది : శ్రమ ఒన్నుమిశ్శె, with pleasure

విద్య : సరేనండి.

శివ : o. k. చీరీయో.

[గోపాలం విస్తుపోయిచూస్తూ వుంటాడు]

# తీరని కోరికలు

## నాల్గవ రంగము.

[రేడియోలో వాయిద్య సంగీతం వినిపిస్తూ వుంటుంది. గురువులు రేడియో మూసివేస్తాడు. గోపాలం సోఫామీద వుంటాడు]

గురు: బాబుగారూ దీపాలుకూడ ఆర్పివెయ్యమంటారా?

గోపా: ఉండుకాసేపు. అరే గురువులూ మీఅమ్మగారికి యీవేళకూడా పూటింగుందా ఏమిట్రా?

గురు: ఏమో నాకు తెల్దండి.

గోపా: మీఅమ్మగారివెంట నువ్వెళ్ళలేదురా?

గురు: ఎళ్లానండి. అక్కడ హోటలుకాడ దింపేసింతర్వాత నన్నుఎల్లి పొమ్మన్నారండి. కారుకావలిస్తే అక్కడనించి ఫోన్ చేస్తానన్నా రండి.

గోపా: మరి టెలిఫోన్ చేశారా?

గురు: లేదండి.

గోపా: నేను క్లబ్బునించివచ్చే గంటన్నరయింది. ఇంతవరకు ఆవిడ జాడే కనబడలేదు. ఇంత సేపూ హోటల్లోఏంచేస్తున్నాదు?

గురు: మరి ఆసంగతులు నాకేం తెలుస్తాయండి.

గోపా: అవున్లే - ఏదో కారు చప్పుడయింది చూడు,

గురు: మనకారు యిందాకే షడ్డులోపెట్టేశారండి. అమ్మగారేమోనండి.

[దూరంగా గుడ్ నైట్; చీరియో అనేమాటల్లో లత, చెట్టియార్, శివశంకర్ గొంతుకలు వినిపిస్తాయి.]

విద్య : [రాగా నే] సారీడార్లింగ్, నేవచ్చేటప్పటికి చాలా ఆలస్యం అయిందికాదూ, వెరీసారీ.

గోపా : ఈ రోజు కొత్తయితేకాదూ యూసారీ రోజూవున్నదేగా?

విద్య : షూటింగున్న రోజుల్లో ఎలాగతప్పదాయె. లేనిరోజుల్లోకూడ యిలాలేవటం నాకెంతో చిన్నతనంగావుంది.

గోపా : [మాటలాడడు]

విద్య : మీభోజనం అయిందా? నాకోసం wait చెయ్యొద్దని టెలిఫోన్ చెయ్యాలనుకునే - వీలులేకపోయింది.

గోపా : అవును వీలెక్కడుంటుంది, అగ్రిమెంటు అంతసేపయిందా?

విద్య : ఆ సేట్ జీ చాలామంచివాడండీ, ఎంతో Social గా వున్నాడు.

గోపా : అవున్లే వుంటాడులే, నీవంటిదాన్ని చూస్తేమరీనీ.

విద్య : ఏమో ఆమాటా యీమాటా అనుకుంటావుంటే యిట్టేటయిమయిపోయింది,

గోపా : అవును మరి యుగాలుక్షణాలుగా గడుస్తాయి.

విద్య : ఆదేమిటలాగంటారు, తీరా వెళిన తర్వాత మనపూర్తిచేసుకోకుండావస్తేమాత్రం ఏమంతభావ్యంగా వుంటుంది, పైగా డైరెక్టరు శివశంకరు, ప్రొడ్యూసరు చెట్టియారు వీళ్లు ఎప్పటికీ వదలరు.

గోపా : వీళ్ళొకళ్ళు, పానకంలో పుడకల్లాగ ఏకాంతానికి భంగం,

విద్య : అదుగో మీ అనుమానం మీదే. ఏకాంతానికేముందీ, అందరం కలిసేమాట్లాడాము. తర్వాతవాళ్ళకి తెలియకుండాకొన్నిసంగతులు మాట్లాడ్డానికి నన్ను ఉండిపొమ్మన్నాడు సేట్ జీ.

గోపా : మరి అదే ఏకాంతం. డిన్నరు కుండిపోయావన్నమాట, అనుకున్నంతా జరిగింది.

విద్య : ఏమనుకున్నారు ఏంజరిగింది. మీరన్నీ కల్పించుకుని మీలోమీరే మథనపడి పోతూవుంటూరు. ఆ డిన్నరుటైంలోనే చెప్పారువారు డిస్ట్రిబ్యూషన్ కోసం ముందే నాల్గు లక్షలు యిస్తామని నన్ను

బుక్ చెయ్యటం ఒకషరతట, నాఅగ్రిమెంటుచూస్తేగాని ఆసొమ్ము యివ్వనన్నారట.

గోపా: అందుకోసమే యీ ఎర చూపించి సొమ్ములాక్కున్నారు.

విద్యు: నాకెంత యిస్తున్నారనికూడ సేట్ జీ అన్నాడు. లక్షయిస్తున్నారని, మనకు జరిగిన మాటలన్నీ చెప్పాను. అయితే సరే అన్నట్టు సంతృప్తిగానే మాట్లాడాడు. ఫోంచేసింతర్వాత అలాగ బీచీవైపు షికారువెళ్దాంఅంటే సరే అంటేసరే అన్నానుకాస్సేపు అలాగ తిరిగి వచ్చేశాము. ఇప్పుడు, 11 గంటలవు తుందేమో.

గోపా: మంచిపనిచేశావు. ఈ11 గంటలకిమాత్రం యింటికి తిరిగిరావడం ఎందుకు? ఈరాత్రంతా వాడ్తోగడపలేక పోయావూ?

విద్యు: ఎందుకు నామీద అలాకోప్పడ్తారు, ఇదంతా అనుమానమే.

గోపా: అనుమానం అంటావుపైగా. వెధవ లక్షరూపాయిలకోసం రాత్రిం బగళ్లు ఆలైట్లముందూ, కెమోరాలముందు గంతులువేసేది కాకుండ ప్రతిపీనుగుతోనూ డిన్నరులు, షికార్లూనా?

విద్యు: దానికే సేట్ జీ అలాంటివాడు కాదండి, ఎంతోఉత్తముడు. మన యింటిబంధువులాగ ఎంతోచనువుగానూ, ఆప్యాయంగానూ మాట్లాడాడు నాతోవున్నంతసేపూ.

గోపా: లక్షరూపాయలతో చనువు, ఆప్యాయత అన్నీవస్తాయి.

విద్యు: మీరలాంటి మాటలనకండి. ఆయన్ని అంటె పాపంకూడ తగుల్తుంది, సత్యగోవులాంటివాడు.

గోపా: అంతా సత్యగోవులే సిగ్గులేకపోతేసరి.

విద్యు: సిగ్గుపడటానికి నేనేం చేశానని, నన్ననరాని మాటలూ అంటున్నారే, మీ కోరిక తీర్చటానికి కాదూ స్టారు నయ్యాను.

గోపా: చీటికీ మాటికీ యిదొక్కటి తెలుసు. మీ మూలాన్నే ఇవన్నీచేశానంటావు. నేను నిన్ను వెండితెర మీద వెలుగు తారను కమ్మన్నాను, గాని అర్ధరాత్రివరకూ అడ్డమైనవాళ్ళతోనూ అపకోపాలు పడమన్నానా? నర్తకినై కీర్తిసంపాదించమన్నానా?

విద్య : చాల్లెండి యివన్నీ నేను చేశానంటారా ?

గోపా : చేశావో లేదో నీకే తెలుసు. భర్తనయిన నా కళ్లలోనే కారంజల్లి మోసం చేశావే.

విద్య : ఛీ పాడుమాటలనకండి. మీకైనా సిగ్గులేదండి.

గోపా : పైగా నాకా సిగ్గు. మొగుణ్ణి కొట్టి మొగసాల కెక్కిందట నీ బోటిదే.

విద్య : చాల్లెండి, మీరు చేసుకున్న ధర్మపత్నిని యిలాంటి అసహ్యపు మాటలనడానికి మీకు నోరెలాగవచ్చింది? ప్రేమిస్తున్నాను నాప్రాణం, నాసర్వస్వం అంటారు అంతమాత్రం నమ్మకం లేదు. అసలు తార జీవితమే యింతనీచమేమో. ఎవరితో మాట్లా డినా అనుమానమే. ప్రేమించి పెండ్లాడిన భర్తే అనుమానిస్తే సామాన్యమానవులు నింద మోపారంటే ఆశ్చర్య మేముంది? తారనవ్వాలి, నాట్యంచేయాలి, నటించి కీర్తి, ధనం సంపాదిం చాలి. మోసంగా మాట్లాడాలి. ఇన్నిచేసినా తనప్రవర్తనలో దోషం లేకుండా కాపాడుకోవాలి. కాని నోటికివచ్చినట్టు అనేస్తారు, నిందలు మోపుతారు,

గోపా : కారణంలేని కార్యంవుంటుందా? తగినంత తార్కాణంలేకుండా వట్టినేఅంటారా?

విద్య : తార్కాణం మీకిప్పుడు కనిపించిందికామోసు చాల్లెండి. మాట్లా డకపోతే ఏమిటి మొద్దులాగ కూచున్నావంటారు. ముఖం కనిపించకుండావుంటే సినిమా తారకుపరదా ఏమిటంటారు. తీరా మాట్లాడికలిసి కట్టుగావుంటే ఇదా? ఏమిటి చూచారని మీ అను మానం ?

గోపా : చూడాలా ఏమిటి ? నువ్వుచెప్పిన మాటలేకదూ? వాడితో డిన్నరుకున్నావు. ఒంటరిగా బీచికి షికారు వెళ్ళానన్నావు.

(7)

విద్య : అదితప్పా? తప్పున్నవారు నేనుఒంటరిగా హోటలువెళ్లి మాట్లాడి రావటానికి ఎందుకు సమ్మతించారు? లక్షరూపాయిలు చేతిలో పడితేదానికేంఅని ఒప్పుకున్నారా!

గోపా : నోచుముయ్. అగ్రిమెంటుమీద సంతకం పెట్టడానికి సమ్మతించాను కాని సరాయివాడితో పరాచకాలు ఆడటానికి పంపలేదు.

విద్య : ఛీ! వెధవమాటలు, భర్త అయినంతమాత్రంచేత నోటికివచ్చి నట్లు అనివెయ్యడమే. ఇదేనా ప్రేమించడం? మీకు నేనంటే ప్రేమకాదు అసూయ. నాకీర్తి, ఐశ్వర్యం మీకుకావాలి. నామనస్సు అక్కరలేదు. మీరువరించింది, ప్రేమించిందీ నా హృదయాన్ని కాదు, నాధనాన్ని నావిలాసాలను. మీకూ ఆపావలా టిక్కెట్టు కొన్నవాళ్ళకీ ఏమిటితేడా. మీ ఆనందంకోసం వన్నొక ఆట వస్తువుగా వుపయోగించుకున్నారు, సాకూ ఆత్మవున్నదని. మానాభిమానాలున్నవనీ గుర్తించకలేకపోయారు. ఎవరికోసం యీవేషాలువేశానో వారికే విశ్వాసంలేకపోయినప్పుడు ఎందుకీ బ్రతుకు.

గోపా : లతా! లతా!!

(తెర)

[నే పథ్యంలో]

మూన్నాళ్ళ బ్రతుకుకే మురిశావు త్రుళ్లావు
ముందుగతి కానవే చిలుకా॥

---

# తీరని కోరికలు

## ఐదవ రంగము.

గోపా : గురువులూ మేనేజరుగారిని పిలవరా.

గురు : అమ్మగార్లో కూడ ఎల్లినట్టుగా వుండారండి.

గోపా : అమ్మగారెక్కడకు వెళ్లారు?

గురు : ఆ పుడ్ కమిటి మీటింగుకో దేనికో ఎల్లారంటండి.

గోపా : సరేలే. యీవేళ అమ్మగారి మద్రాసు ప్రయాణంవుందా ?

గురు : ఇందాక నేను టిక్కెట్టు కొనాలని ఎల్తావుంటే మేనేజరుగారు ఒద్దన్నారండి.

గోపా . ఎందుకని ?

గురు : అదేమోనండి మరి.

గోపా : ఈయింట్లో ప్రతివాడికీ పెత్తనంలాగే వుందే, అడిగేవాడూ అడేవాడూ లేక.

గురు : అరుగో మేనేజరుగారు వచ్చినట్టుగా వున్నారండి,

మేనేజరు : గుడ్ మార్నింగ్ సార్.

గోపా : ఇంతసేపూ ఎక్కడికి వెళ్ళావు.

మేనే : **Food Commettee meeting** వుందన్నారండి. అందుకని

గోపా : **Food Commettee meeting** వుంటే నువ్వేంచేస్తావ్.

మేనే : మేలువరం మునసబుగారి గొడవ తీర్చటానికి ఆ కాగితాలన్నీ అమ్మగారు తెమ్మన్నారండి. ఆ ప్రొక్యూర్ మెంటు కేసులో కలెక్టరు గారితో చెప్పి మాపుచేయిస్తానన్నారండి.

గోపా : సరే మీటంగు తర్వాత ఆవిడ ఎక్కడకు వెళ్ళింది,

మేనే : వనమహోత్సవం గురించి యీవేళ సాయంకాలం కాలేజీలో సభ చేస్తారటండి. అమ్మగారిని ఆ సభకు President గా వుండ వలసిందని కలెక్టరుగారూ వారూ అడిగారు అమ్మగారు సరేనని వారి కారులోనే అమొక్కలూ అవీ తెచ్చినచోటికి వెళ్ళారండి.

గోపా : అలాగా, నిన్నటిసభలో మన వుపన్యాసం చదవక మరొకటి చదివిం దెందుకు ?

మేనే : ఆయనెవరో Republic కవిగారటండి. ఆయన వ్రాసిన వుపన్యాసం బాగుందని అది చదివారండి.

గోపా : మరలాగ ఎందుకు చదువనిచ్చావు,

మేనే : అమ్మగారు చేసేదానికి నేనేం చెప్పనండి.

గోపా : అన్నిటికీ అమ్మగారు వంక, ఇవన్నీ నువ్వు వెనకుండి చేయిస్తున్నావు. ప్రయాణంమాట ఏంచేశారు ?

మేనే : లేదటండి. టిక్కెట్లు కొనిపించ వద్దన్నారండి.

గోపా : ఆమాట నాతో ఎందుకు చెప్పలేదు.

మేనే : అమ్మగారు programme మార్చేశారండి, యీలోపున School Building cortract వచ్చింది, అమ్మగారు వస్తే గాని పనిజరగదని ఆ కాంట్రాక్టరు నెత్తిమీద కూర్చున్నారండి.

గోపా : ఇదిమాత్రం అర్జెంటుకాదూ. ఆ సెట్టికి యినుము పర్మిట్ యిప్పిస్తామని వాగ్దానం చేశాం, వాళ్ళబ్బాయికి ఇంజనీరింగు కాలేజీలో సీటు ఇవన్నీ ఆయిపోయిన తర్వాత వెళ్ళి అడుక్కుతినటానికా ?

మేనే : ఏమో అవన్నీనాకు తెలియవండి. అమ్మగారు......,

గోపా : చీటికీ మాటికీ అమ్మగారని చెప్పకు మొన్న చెక్ మార్పించారా?
మేనే : లేదండి.
గోపా : ఎందుకింత ఆలస్యం.
మేనే : వేరే తొందరపనుల్లో అమ్మగారితో కూడ వుండిపోయానండి.
గోపా : మా పనులంత పని రానివి అమ్మగారివి తొందరపనులూనా?
మేనే : అట్టే అమ్మగారికి మీకు భేదం ఏమిటండి.
గోపా : భేదం లేకుండానే యివన్నీ తారుమారు చేస్తున్నావు.
మేనే : క్షమించాలి. నేను మాత్రం ఊరికేవున్నానా?
గోపా : ఊరికే వుండవు. మాటకిమాట ఎదురుచెప్తావు.
మేనే : రామరామ అదేమీ లేదండి,
గోపా : నిన్న చెప్పిన **Press statements** పత్రికలకు పంపావా?
మేనే : ఏం **statement** అండీ?
గోపా : ఏం **statement** ఓ తెలియని స్థితికి వచ్చిందన్నమాట ఆ తుపాను నిధిగురించి.
మేనే : చిత్తం ఆబెస్తపల్లె గురించి **Vouchers** బాకీ ఉన్నాయని అమ్మగారే ఆపెయ్యమన్నారండి.
గోపా : అవి బనాయించలేక పోయావూ.
మేనే : అదేనండి. రేపుతెచ్చి పత్రికలకు పంపమన్నారండి,
గోపా : రేపెందుకు ఏడవను. అయ్యవచ్చేవరకు అమావాస్య ఆగుతుందా. వాళ్ళ పార్టీవాళ్ళ **statement** యివాళ పత్రికల్లో వచ్చేసింది? ఇకమనం తన్నుకు చావాలి. ఏదిచెప్పినా యింతే దొంగపడ్డ ఆరునెలలకు కుక్క మొరిగిందని ఎప్పుడో వేస్తారు. మొన్న చేనేత పరిశ్రమలమీద **Statements, S. S. L. C.,** పరీక్షల మీద **Statements** వాళ్ళపార్టీవాళ్ళు ప్రకటించిం తర్వాత ఘనదా ఛీ.

మేనే : మరేం చెయ్యనండి అమ్మగారు......

గోపా : మీకు చేతకాకపోతే వెళ్ళిపొండి, మేమింకొకరిని Personal-Assistant గా పెట్టుకుంటాం.

మేనే : అమ్మగారు పొమ్మంటే అలాగే పోతాలెండి.

గోపా: అమ్మగారొకటి నేనొకటినా. ముందవతలికి నడు Dismiss getout.

విద్య : ఎమిటండీ ఆ కేకలు వీధిలో ఎవరైనా వింటే నవ్వుతారు.

గోపా : నవ్వరూ ! మనబ్రతుకే నవ్వుల పాలుగావుంది.

విద్య : మేనేజరుగారూ మీరు లోపలికివెళ్ళి మీపని చూసుకోండి. అవసరమైతే కబురుచేస్తాను.

మేనే : చిత్తం,

విద్య : ఎందుకీ రభసంతానూ,

గోపా : మద్రాసు ప్రయాణం Cancel చేశావు, మరొక ప్రయాణం ఏర్పాటు చేశావు. Statements అపు చేయించావు, ఏమిటిదంతా ?

విద్య : ఒకటిరెండు రోజులాలస్యంగా అన్నీ అవుతాయి.

గోపా : ఆలస్యం అమృతం విషం, అంతా అయినతర్వాత ఆకులు ఎత్తడానికి వెళ్ళాలి. ఎందుకు ఏడవనా ?

విద్య : మరేం ఫరవాలేదు. ఇది అర్జెంటా?

గోపా : అన్నిటికీ నీయిష్టమేనా?

విద్య : నేను చేసేపనులకి నాయిష్టంకాక యింకెవ్వరిష్టం.

గోపా : ఓహో ! అంతవరకూ వచ్చింది. ఇక సంసారం, భర్త అని యెందుకు? ఆఖరికి ఒక గుమాస్తాపాటి చెయ్యక పోయినతర్వాత.

విద్య : వాడికీ మీకూ సామ్యంపెట్టుకుంటా రెందుకు? అసలు ఇలాంటి వాటిల్లో జోక్యం కలిగించుకోవద్దని అనేకసార్లు చెప్పాను,

గోపా : భార్యజోక్యం భర్తకుకాకపోతే ఎవరికి ?

విద్యు : సరేలెండి. యీ రాజకీయ వ్యవహారాలు పెద్దరొంపి. వీటిల్లోదిగే కొద్దీ యింకాఊబిలో పడిపోతాం. అందుకే యీకుళ్లు గోతికి ఎంతదూరంగా వుంటే అంత మంచిదన్నాను.

గోపా : దూరంగా వుండక నేనేం పులుము కొంటున్నానా ? ఎంత చేర దలచినా నువ్వునన్ను చేరనిస్తేగా ?

విద్యు : పాపపు మాటలనకండి.

గోపా : నేను వ్రాసిన వుపన్యాసం ఎందుకు చదవలేదూ ?

విద్యు : ఈమాటు ఆ రిపబ్లిక్ కవిగారట. ఆయన వ్రాసింది చూడగానే అది చదవాలని బుద్ధి పుట్టింది.

గోపా : వెధవబుద్ధి: అది చదివితే ఎంత అల్లరిచేశారో విన్నావా ?

విద్యు : వాళ్ళ అల్లరి వాళ్ళకే వుంటుంది. మనకేం.

గోపా . మనకు కాదూ? మానాభిమానాలు నీవంటే వదలు కున్నావు, నలు గురిలోనూ పేరు ప్రతిష్ఠలుగల నావంటివాడు పలానా ఆవిడ భర్త అనిపించుకోవడం సిగ్గుచేటు.

విద్యు : మీకంత చిన్నతనంగావుంటే మీరు నాభర్త అని ఎవరితోనూ అనకండి.

గోపా : తొండముదిరి ఊసరివెల్లి అయింది. నీకంత వెగటుగా వుంటే నేనెందుకు పెళ్లాడటం.

విద్యు : మీరన్నదే కాదూ మీరసలు నన్ను అర్థంచేసుకోలేదు.

గోపా . బాగా అర్థంచేసుకున్నాను. భర్త అంటే నీచేతి రుమాలులాగ వుండాలి.

విద్యు : మీరూ అలాగ చూస్తున్నారు. భార్య మీచేతిలో ఫవుంటెన్‌పెన్ లాగ వుండాలని. మీరెలాగ వ్యక్తిత్వాన్ని కోరుతున్నారో నేనూ అలాగే కోరుతున్నాను.

గోపా : నీకు వ్యక్తిత్వం వుండకూడదని ఎవరన్నారు. అది మరీ ఎక్కువగా వుండి ఎదుట వారిని నిర్లక్ష్యం చేసేవరకు వచ్చిందంటున్నాను.

విద్య : ఏమిటి నిర్లక్ష్యం. మీరు ఆడమన్నఆట ఆడినంతసేపూ మంచిదాన్నయానా? నాకు విసుగెత్తిపోతోంది. వెధవ బ్రతుకు. అద్దమైనవాళ్ళూచెప్పినట్టు వినడం, వాళ్ళపనులు చేయించటం, ఉపన్యాసాలివ్వటం. యింతేనా? నాకుతోచినపని చెయ్యడానికి హక్కుకొరితేతప్పా? నాస్టేటుమెంటు నేను ఆపటానికి. నా ప్రయాణం నేను మానడానికి, ఉపన్యాసం నేను మార్చటానికి అధికారంలేదా? నాయిష్టంవచ్చినట్టుచేస్తే మీ వ్యక్తిత్వానికిలోటా?

గోపా ; సరే లోటులేదు. గుమాస్తాలు, నౌకర్లుకూడ నేనంటే మర్యాద చెయ్యరేం అని

విద్య : ఎందుకుచేస్తారు. అమ్మగారువేరు. అయ్యగారు వేరనిభేదం మీరే నూరిపోస్తున్నారు.

గోపా : దాంపత్యం అన్నతర్వాత భర్తకుహక్కు లేదంటావా?

విద్య : హక్కుకావలసినవారు బాధ్యతకూడ గుర్తించాలి. నౌకర్లఎదట భార్యను తూలనాడటం హక్కుగలభర్త చెయ్యవలసినబాధ్యతయేనా? దాంపత్యంఅన్న తర్వాత పూసలో దారంలాగకలిసిపోవాలి. మనస్సువేరై పోయింతర్వాత ఇంకాదాపత్యసుఖం ఏమిటి?

గోపా : దాంపత్యసుఖంకూడ వుండనిచ్చావు? తెల్లారిలేస్తేసభలు చట్టుబండలుతోటే బ్రతుకంతా తెల్లవారిపోయింది.

విద్య : మరోప్రశక్తి మీరుమాత్రం రానిస్తేకాదూ.

గోపా : దానికి నీకు తీరికఏదీ? దాంపత్య జీవనంలో భార్య అనేది మంచి వంటకాలుచేసి 'పెట్టటంఅనీ, తినిపించడంఅనీ నీచేత్తో కాఫీ అయినాకాచి యిచ్చావు?

విద్య : ఇంక వంటింటోచేరి కళ్లుచిల్లులుపడేటట్టు వంటచెయ్యాలి. మీ రంతగా సర్దాపడిన యీరాజకీయ జీవితం యిలా బ్రొద్దువాలి పోయింది. ఇకనట్టింట వంటమంటపెట్టాలి.

గోపా : పోనీ వంటచెయ్యొద్దు. ఏవెన్నెలరాత్రయినా ఖులాసాగా దగ్గరగా వచ్చి చనువుగా పలకరిస్తావను కుంటాను. పలుకే బంగారం అయిపోతే.

విద్య : ఈ పనులతో యింటికితిరిగివచ్చేదే అర్ధరాత్రివేళ. తీరికగా మట్లాట్టానికి వెన్నెల ఆనందించడానికి వ్యవధిఏదీ ?

గోపా : పోనీ సతీధర్మంలేదు. పత్నీధర్మంలేదు. కనీసం మాతృధర్మం అయినా గుర్తించావు. స్త్రీ అయినతర్వాత తనదీ అనిపించుకునే సంసారం దిద్దుకోవాలనీ. పిల్లలను ఎత్తుకోవాలనీ ముచ్చటపడు తుంది. నీకాతలంపే లేకపోతే.

విద్య : ఆలాటి తలపులు ఎక్కడకలుగుతాయి. మనంజీవించే జీవితమే కృత్రిమజీవితం అయితే. మీరూహించే పత్ని ఉద్యోగాలు చెయ్యాలి. ఊళ్ళేలాలి. ఊరేగింపులు చేసుకోవాలి. ఉపన్యాసా లివ్వాలి, హాహాఅని పేరు గడించాలి. దాంతోపాటు యింట్లో వంటలక్కకావాలి. బిడ్డలతల్లికావాలి. రెంటికీ ఎట్లాపొసుగుతుంది. మీరుమాత్రం దాంపత్యజీవనానికి అనుగుణంగా ఏంచేశారు. ఎంతసేపూ పర్మిట్లు. ప్రసంగాలు, ఉపన్యాసాలు, కంట్రాక్టులకోరారు కాని నా మనస్సుకోరలేదు.

గోపా : నిన్ను చూస్తేనే భయం వేస్తే.

విద్య : అవును. భయానికి నన్నొక దయ్యంలాగాను, భూతంగాను మీరు తయారుచేశారు. నాలో స్త్రీత్వం. కోమలస్వభావం చంపేశారు నన్ను కరకుతనంతో కేకలువేసే బ్రహ్మరాక్షసిగాచేశారు. నాలోని

స్త్రీత్వాన్ని మీరెన్నడు గ్రహించారు? తీరా నిర్మల మనస్సుతో సర్వస్వం అర్పించగలిగే స్త్రీగా మిమ్మల్ని వరిస్తేమాత్రం మీరు భరించగలరా?

గోపా : లతా! లతా!!

విన్నావా జీవిత రహస్యం
తెలుసుకున్నావా లోకపు విచిత్రం
మనసుతీర కామించినదే నీమది కలచు
భయంకర రాక్షసి
నీకు తెలియకే నిను వెంటాడిన నీలో
శత్రువు కన్నావా
నిన్ను కలియకే నీలో అణగిన ఆత్మ
ప్రబోధము విన్నావా!!

---

# తీరని కోరికలు

## ఆరవ రంగము.

[వెన్నెల - ఆనందసమయం - విద్యాదేవి పాడుకుంటూ వుంటుంది.]

మరవురాని యీ రేయి
మరల నాకురాదోయి
మనసుతీర సుఖియింతము రావో
మనోహరా యీ రేయి
జిలిబిలి కమ్మని పాటగా
వలపుల పువ్వుల బాటగా
కలకల నవ్వుల మూటగా
గలగల మువ్వల ఆటగా
అనుభవింత మీ పూట
నీ కనుపాపల నీడలో నా కనుదమ్ముల ముద్దిడరా॥

గోపా : ఎంత అందంగా వున్నావు విద్యా? నీలిమబ్బుల్లోంచి వెలువడిన నెలవంకలాగా నిన్ను చూచే కొద్దీ యింకా చూడాలనే వుంది.

విద్య : పోనిస్తురూ అస్తమానమూ ఆ మాటలే.

గోపా : విద్యా నిజంగా నేనెంత అదృష్టవంతుణ్ణి నీ వంటి సౌందర్యవతి, విద్యావతి నన్ను వరించడం ఎంతభాగ్యం? ఇది కలకాలం వుంటుందా ?

విద్య : ఏమిటో మీ పిచ్చి, పోనీ యీ ఒక్క క్షణమైనా యిది సాధ్యం అయినందుకు మనం నిజంగా అదృష్టవంతులం?

గోపా : విద్యా నా నిమిత్తం నువ్వెంత సాహసం చేశావు? ఇన్ని అభ్యంతరాలుండగా మన ప్రేమ వివాహం సాధ్యం అవుతుందనుకోలేదు. నీ తలిదండ్రులు మొదట ఒప్పుకోలేదు. మావాళ్లు అసలే యిష్టపడలేదు. మన జాతిభేదం ఆస్తిభేధాలు ...

విద్య : ఇప్పటికీ నా కిదంతా స్వప్నంలా వుంది, కాని నిజమని నమ్మలేక పోతున్నాను, ఇంతకీ మా అమ్మ నా మొండిపట్టుచూచి కాదనలేకపోయింది. నాన్నకు తెలియకుండా ఆయన ఊళ్ళోలేని సమయం చూచి నన్ను పంపించి వేసింది. మీరుకూడా నాకోసం ఎంతో త్యాగం చేశారు, మీ నాన్నగారు అంత కఠినంగా మీకు పూచికపుల్ల ముట్టకుండ చేశారు.

గోపా : ఇదంతా ఒక స్వప్నగాధలాగావుంది. ఇప్పుడు తలచు కుంటే అంతధైర్యం నాకెలాగొచ్చిందో నాకే ఆశ్చర్యంగావుంది. విద్యా! నీ ప్రేమబలంఅలాంటిది. నీకోసం నేనెన్నయినా చేస్తాను. ఎంత త్యాగానికైనా వెనుదీయను. నిన్నుచూస్తేనే ఎన్ని కార్యాలయినా సాధిస్తాననిపిస్తుంది.

విద్య : నాలో ఏముందండి ? మీ హృదయం అంతవిశాలమైంది. నా అల్పత్వాన్నికూడ గొప్పగాచూచుకునే ఉదారత్వంమీది.

గోపా : విద్యా! నీకనుపాపల్లో నానీడచూచుకుంటూ ఎల్లప్పుడూ యిలాగే గడచిపోతుందా ?

విద్య : ఎందుకు గడవదు ? ఎందుకు మీకాభయం ?

గోపా : ఏమోనాకు భయంగానేవుంది.

విద్య : అవునుసుమండి, నాకూ ఏదోచెప్పరాని దిగులుగా వుంటుంది.

గోపా : ఆ దిగులు సహజమే. తలిదండ్రుల్ని వదలిపెట్టి తొలిసారి ఒంటరిగావుండటం బెంగగానేవుంటుంది,

విద్య : నాకా దిగులు లేదు - ఏదో...

గోపా : ఎలాగయినా యిట్లా సంఘం, కుటుంబం అన్నింటినీవదలి వెచ్చి వెయ్యడం కష్టంగానేవుంటుంది.

విద్య : ఎన్ని వదలివచ్చినా మీసరసనువుంటే నాకా కష్టంలేదు.

గోపా : అదికాదు విద్యా ఎల్లప్పుడు పరిచారికల సపర్యలమధ్య దివ్య సౌధాలలో పంచభక్ష్యపరమాన్నాల నారగిస్తూ జీవించేదానివి. యీ చీకటిగదిలో హోటలుతిండితో నానాప స్తలూ పడుతూ వుండటం ఎంతవిచారం కలిగిస్తుంది.

విద్య : అలాఎన్నడూ భావించకండి, మీతోడిదేనాకు స్వర్గం, మీతోపస్తు గడిపినా నాకదే పంచభక్ష్యపరమాన్నాలు. అడవిలోవున్నామన్నా నాకు రాజభవనాల్లో ఉన్నట్టేవుంటుంది.

గోపా : నీ హృదయం అటువంటిది. నాకుతెలుసు విద్యా! కాని మన ఆనందాన్నిచూచి సహించలేదీ లోకం.

విద్య : లోకంతో మనకెందుకు ? వాళ్ళనుకునేది అనుకోనివ్వండి.

గోపా : అంతటితో ఆగరు. యీ యింటివాళ్ళుమాడు అద్దెకివ్వడానికి ఎన్నిక్రాసు పరీక్షలు చేశారనుకున్నావు?

విద్య : వాళ్ళద్దె వాళ్ళకి పారేస్తున్నప్పుడు ఎవరెట్లాంటే వాళ్ళకేమో ?

గోపా : ఈలోకం అటువంటిది, అందరిసౌఖ్యం వాళ్ళకే కావాలి. ఒకళ్లు సుఖంగా వుంటే సహించలేరు. అసుఖం వాళ్ళ కామెర్ల కళ్ళకు పచ్చగా కనిపిస్తుంది. సుఖం అనే ఆడబొమ్మకి మీసాలు గెడ్డాలుపెట్టి వెక్కిరిస్తుందీలోకం. చివరికి ఆసుఖంఅనుభవించే వాళ్ళు కూడా తమలాగే దిగజారిపోయి అవస్థలు పడేవరకు వాళ్ళకు విద్రపట్టదు.

విద్య : అది యీవేళ కొత్తగా వచ్చిందా ఏమిటి ? తరతరాలినుం వస్తున్న పరిపాటేగా ?

గోపా : ఇందాక హోటలికి వెళ్తే నన్నెరుగున్న పెద్దమనిషి తటస్థపడి పెళ్ళిగురించి వెయ్యి ప్రశ్నలు వేశాడు. మా నాన్నగారితో నేను విడిపోయిన సంగతి పెద్ద తర్జనభర్జనగా అడిగాడు. అన్నిటికీ సమాధానం చెప్పి వచ్చేశాను. వస్తూవుంటే దారిలో అమ్మలక్కలు కుళాయిదగ్గరచేరి నన్నుచూచి ఒకటే గుసగుసలు.

విద్య : అవునులెండి ఎక్కడలేనిసంగతులూ వాళ్ళకే కావాలి. ఇందాక మీరు ఊళ్ళోకి వెళ్ళినప్పుడు ప్రక్కింటిపిల్లలు వచ్చి కిటికీలోంచి వింత జంతువులను చూచినట్లు చూచిపోయారు.

గోపా : తొలిరోజునే యిలాగుంటే రేపు నేను అఫీసుకువెళ్ళివస్తూవుంటే నువ్వెట్లా ఒంటరిగా కాలక్షేపం చేస్తావో తెలియకుండా వుంది.

విద్య : నన్నుగురించి మీరేమీ బెంగపెట్టుకోకండి, మీ మనస్సు నిశ్చింతగా వుంచుకోండి.

గోపా : విద్యా మనకీ వివాహం కాకపోతే మనం ఏమైపోయేవాళ్ళమో ? నా జీవితమంతా పిచ్చివాడిగా తిరిగేవాణ్ణిమో ?

విద్య : ఈ వివాహం కాకపోతే నే నీపాటికి మరణించేదాన్ని.

గోపా : వెర్రిలోకం కాకపోతే ప్రేమించుకుని వివాహం చేసుకునేవాళ్ళకి ఇన్ని ప్రతిబంధకాలు కలిగిస్తారు. నిజానికి అలాంటి వివాహంలో ఆనందం వాళ్ళకేంతెలుస్తుంది ?

విద్య . వాళ్ళకేంతెలుసు. వాళ్ళ చేసింది శిలాశాసనం.

గోపా : విద్యా ! నీకు కూడ వేరే వివాహం నిశ్చయం చేసినప్పటికి తప్పించుకు రాగలిగావు. అదీ విశేషం.

విద్య : అమ్మతో చెప్పాను. బలవంతంగా మంగళసూత్రం కట్టేస్తే పురిత్రాడు బిగించుకుంటానని.

గోపా : అంత సాహసం ఎందుకులే ?

విద్య : జీవచ్ఛవంలా బ్రతికుండి ఏం చేస్తాను. నా తెగింపు అమ్మకు తెలుసు. అదీగాక అమ్మతో ఉన్నమాట చెప్పేశాను.

గోపా : నాసంగతేనా ?

విద్య : కాలేజీలో మనస్నేహం. సినిమాలో మనం కలుసుకోవడం పెళ్ళిచేసికుంటానని మీరు చేసినవాగ్దానం, సెలవుల్లో మనిద్దరం కలసి ఊటీలో కాలక్షేపం చెయ్యటం.

గోపా : ఇవన్నీ తెలిసినతర్వాత మీ అమ్మగారేమీ అనలేదా ?

విద్య : ఏమంటుంది? ఆఖరికి యీ రహస్యంకూడ తెలిసింది.

గోపా : కాశీవెళ్ళి మనంవివాహం చేసుకుందామనుకున్న నిశ్చయమేనా ?

విద్య : అలాగ నిశ్చయంచేసింతర్వాత నాలుగుమాసాలు గడిచిపోయాయి. మళ్ళీమీరు కనిపించలేదు. మీకు ఉత్తరాలు వ్రాస్తూవున్న సంగతి అమ్మకు తెలుసు. చివరికి నాబ్రతుకయిలాగే కడతేరిపోతుందను కున్నాను.

గోపా : విద్యా ! మాటయిచ్చినతర్వాత ద్రోహంచేస్తానా ! ఉద్యోగంచేత చిక్కించుకోందే వివాహంచేసుకోకూడదను కున్నాను. తిన్నగా పట్నం వచ్చేశాను. నాలుగు మాసాలు ప్రయత్నంచేశాను. చివరికి యీ కంపెనీలో దొరికింది, మనకిక చింతలేదు, ఇంక నీకుకూడ ఏస్కూలులోనో పనిదొరికితే వేణ్ణీళ్ళకుచన్నీళ్లతోడై ...

విద్య : మీరప్పుడే ఆ ఆశ పెట్టుకోకండి. ఈయడ్డు రవంతాతీరిపోయిం తర్వాత ...

గోపా : ఏ అడ్డూ !?

విద్య : తెలియనట్టు అలా అదిరిపడతావే.

గోపా : నాకర్థం కావటంలేదు.

విద్య : అర్థంకావటానికేముంది? మీరు కొద్ది మాసాలలో పాపాయి నెత్తుకోబోతున్నారు.

గోపా : ఆఁ.

విద్య : ఏం! ఇంతత్వరగా తండ్రికావటానికి యిష్టంలేదా?

గోపా : నాతో పరిహాసమా విద్యా! నిజమా?

విద్య : నిజమే. అమ్మకుకూడ తెలుసు. తల్లిని కాబోతున్నానని తెలిసే నేభయపెట్టడంచూసి రెండుప్రాణాలను చంపడం ఎందుకని చివరకు ఒప్పుకుంది.

గోపా : నాకింతవరకూ ఎందుకుచెప్పలేదూ?

విద్య : నాకూ తెలియదు.

గోపా : మనం పెళ్ళిచేసుకునే సమయానికి నీకుతెలుసా?

విద్య : తెలుసు.

గోపా : అప్పుడెందుకు చెప్పలేదూ?

విద్య : మీరు గ్రహించారను కున్నాను.

గోపా : ఎలాగ్రహిస్తానను కున్నావు. ఇంతముఖ్యవిషయం పరమ గోప్యంగా ఎందుకుదాచావు?

విద్య : మీరు నామీదప్రేమకొద్దీ ఇటువంటివేమీ పాటించరనుకున్నాను.

గోపా : ప్రేమకొద్దీ ఏంచేసినా చెల్లుతుందమకున్నావా? ఎంతద్రోహం!

విద్య : ఇందులో నేచేసినద్రోహం ఏముంది?

గోపా : ఇంతకంటె ఏంద్రోహం చెయ్యాలి. నీవే ఘాతుకకృత్యాలుచేసినా సహించే గ్రుడ్డితనం నీ ప్రేమ కలిగించలేదు. నీకోసం నా కుటుంబం వదలుకున్నాను. కులానికి దూరంఅయ్యాను, గౌరవప్రతిష్టలు గంగలోకలిపాను. చివరకు నన్నునమ్మించి ద్రోహంచేశావు.

విద్య : నేనా ద్రోహంచేసింది? ఈ మాతృత్వం మీవల్లతప్ప ఇంకెవ్వరి వల్ల కలుగుతుందనుకున్నారు. అలాంటి పాపచింత మీకెలాగ కలిగింది. ఇంతసేపుచెప్పినా ప్రేమవాక్యాలన్నీ అంత పిచపు ప్వార్థపు వాక్యాలేనా?

గోపా : అదేలాగసంభవం. మనం కాలేజీలో చదివినంత సేపూ దూర దూరంగానే వున్నాము. ఒక్కసారికూడ కలుసుకోలేదు.

విద్య : సెలవుల్లో మనం మద్రాసు వెళ్ళినపుడు, ఊటీకొండల్లో విహరించి నపుడు జరిగింది మరచిపోయారా ?

గోపా : అదెంత ? కొద్దిరోజులుమాత్రమే. విద్యా నన్ను ద్రోహంచేశావు. నాకు తెలియకుండానే ఎవరితోనో అపచారంచేశావు. నీపాపఫలం నా పైనవేస్తున్నావు. విద్యా !

విద్య : అబ్బబ్బ! శూలాల్లాంటి మాటలు మీరెలాగ అనగలుగుతున్నారు ? ప్రేమ దేవతవు, అప్సరసవు, అని పొగిడిన నన్నేయిలాగ అవ మానిస్తున్నారా ? మీ హృదయం అంత దుర్బలమా ?

గోపా : విద్యా నాలోలేదు దుర్బలత. నీవు దుర్బలురాలివి. అవును. నిన్ను ప్రేమదేవతగా ఆరాధించాను. నీకోసం సర్వస్వమూ ధారపోశాను. బలి అయిపోయాను. నీచాపల్యానికి నన్ను బలితీసుకున్నావు.

విద్య : నన్ను నిజంగా ప్రేమిస్తే ఎందుకుశంకిస్తారు. విశ్వాసంలేనిప్రేమ ఎందుకొచ్చిన ప్రేమ ? నాతో ఆనందంగా కాలక్షేపంచేసి, నా యవ్వనం పంచుకొన్నంత సేపూ మీకేమీ కనుపించలేదు. వివాహం కాలేదు వద్దనిచెప్పినా నా మాటవినలేదు.

గోపా : అంతమాత్రానికే నువ్వు మాతృత్వాన్ని ధరించావా ? నమ్మలేను.

విద్య : ఇదిప్రకృతి సహజం. ఇంతచదువుకుని యీ మాత్రం ప్రకృతి స్వభావాన్ని నమ్మలేరా?

గోపా : సరే! నేనే తండ్రినయితే ఇంతకాలం ఎందుకు కప్పిపుచ్చావు. వివాహకాలంలో ఎందుకు చెప్పలేదు ?

విద్య : ఇందులో రహస్యం ఏముంది ? మనకు తెలిసిందేకదా అనుకు న్నాను. తాను తల్లిని కాబోతున్న సంగతి ఏ స్త్రీ సిగ్గు విడిచి చెబుతుంది ? మీరుగాక యింకెవ్వరు నన్నెరిగినవారు ?

గోపా : ఏమో నన్ను మోసం చేసినట్లు ఎందరిని మోసం చేశావో.

విద్య : ఛీ! నన్ను అసహాయనుచేసి అనరాని మాటలనకండి. ఎవరు చేసిన పాపఫలం అయినా భరించేది స్త్రీ. చపల అనీ దుర్బల అనీ తోసివేస్తారు. మీ అనుమాన పిశాచాలకు గురి అయ్యేది మేము మేరుపర్వతంలాంటి మీ పాపాలు నలుసుల్లాగా కూడా కనిపించవు. మాలో దోషం లేకపోయినా మేము ద్రోహులాగా గోచరిస్తాం. సరే కానివ్వండి. మీ కంత కష్టంగా వుంటే ఒదిలేసెయ్యండి. మీ త్రోవ మీది, నా త్రోవ నాది.

ఇంతేనా ప్రేమకు ప్రతిఫలమింతేనా !
అందరాని ఫలముల కాసించితివి
ఆశలన్ని నిజమైన యంతలో
అందుకున్న ఫలమువలె అలతాయెను.
ఆశ నిరాశయై యలమటించెదవు
నీ చే జిక్కిన నిధి నిక్షేపము
నిజమని నమ్మక జారవిడిచితివి
నీపై నీకే ధైర్యముపోయిన
నీకు మిగులునది నీ దౌర్బల్యమే.

---

# తీరని కోరికలు

## ఏడవ రంగము.

అబ్బాయి : అమ్మా నాన్నగారు అన్నానికింకా రాలేదు.

విద్య : నౌకరును పంపిస్తారేమో.

అబ్బాయి : వాడసలు రాడమ్మా. ప్రొద్దున తినలేదేం అమ్మా.

విద్య : వంట కొంచెం ఆలస్యంగా అయింది. కోపగించి వరుగెత్తారు.

అబ్బాయి : ఎందుకయింది ఆలస్యం.

విద్య : బియ్యం అయిపోయాయి. నువ్వెళ్ళి ఆ స్టోర్సులో తెచ్చేవరకు ఒక్క గింజలేదు. ఏం కరువొచ్చి పోయిందో.

అబ్బాయి : వంట అయింతర్వాత నేను ఆఫీసుకెళ్ళి యిచ్చిరానా ?

విద్య : నువ్వుకూడ ఎందుకు నాయనా ఆయవెళ్ళింది కాకుండ.

గురువులు : ఎవరమ్మా.

విద్య : చూడు ఎవరో వచ్చారు అబ్బాయి ?

అబ్బాయి : ఆఫీసునౌకరు గురువులు.

విద్య : అన్నం తీసికెళ్ళడానికి వచ్చాడేమో.

గురువులు : ఏవండమ్మా ఆయనొచ్చారా ?

విద్య : ఇప్పుడెందుకు వస్తారు ఆఫీసుకెళ్తారు.

గురువులు : ఆఫీసులో దెబ్బలాడి వచ్చేశారు.

విద్య : ఆఫీసులో ఎందుకు తగవులు. ఆయనకెంత కోపంవస్తే అంతే. కోపంలో వళ్ళుపైని తెలియదు.

గురువులు : కోపం ఎవరిమీద చూపిస్తే ఎవరూరు కుంటారు ?

విద్య : అసలెందుకు వచ్చింది.

గురువులు : ఆఫీసుకు ఆలశం అయిందండి.

విద్య : ఇంకేం ఆలస్యం. అక్కడకీ ఫోంచెయ్యకుండానే వచ్చారు.

గురువులు : అందుకేనేమోనండి ఆ దూకుడు. నన్నింటికెళ్ళి అన్నీ తెమ్మన్నారండి. నే నెల్లనన్నాడండి. దానికి కస్సుమన్నారండి. నేనొచ్చి తీసుకొచ్చేవాణ్ణండి. ఆ మేనేజరుగా రెల్లొద్దనా్నరండి.

విద్య : మరిప్పుడెందుకు వచ్చావు ?

గురువులు : ఉద్యోగం వద్దని రాజీనామాయిచ్చి వచ్చారండి. మేనేజరు గారు చెప్పితీసుకు రమ్మని నన్ను పంపించారండి.

విద్య : మంచిపనే అయిందీ. ఆయనకి తిక్కవస్తే అంతే.

మేనేజరు : మీరైనా చెప్పండమ్మా పదుగురిలోకి వెళ్ళేవాడికి అంతకోపం అయితే ఎలా ?

విద్య : అయ్యో మీరే స్వయంగా వచ్చారా ?

మేనే : మీరు మందలించుకోండి, అంత నోటిదురుసు పనికిరాదు, జాగ్రత్తగా నడుచుకోమనండి.

గోపా : ఏమిటి జాగ్రత్త ! మా యింటిదగ్గరకుకూడ నన్ను వేటాడుతున్నారు. ఏలినాటి శనిలాగ. నా బానిసత్వం మీ ఆఫీసుతో సరి, యివ్వాళ్టితో మీకూనాకూ తెగతెంపులు అయింది. పదండి.

గురు : బాబుగారూ బాగా ఆలోచించుకోండి యిప్పుడైనా.

మేనే : మీ రాజీనామా మేమింకా అంగీకరించలేదు.

గోపా : నీలెక్క ఎవరికి. నేనిచ్చాను పో. ఉన్నన్నాళ్ళూ అక్కడ ప్రాణాలు కొరుక్కుని తిన్నదికాకుండ ఇక్కడ ఇంటిలోకూడ దాపురించారు. పొండి అవతలికి——

అబ్బాయి : అమ్మా, నాన్నగారికి కోపం వచ్చిందే.

గోపా : కోపంరాదూ ప్రతి చవటపీనుగు హేళనచేస్తుంటే.

విద్య : పోనీ వాళ్ళహేళన వాళ్ళకేవుంటుంది. మందేం పోయింది.

గోపా : మానాభిమానాలు సిగ్గు భిడియాలు వదులుకుని ఎన్నాళ్ళు యీ పాడు వుద్యోగం చెయ్యమంటావు ?

విద్య : చేసేవాళ్ళంతా చెయ్యడంలేదూ, మీలాగే గిల్లికజ్జాలు పెట్టు కుంటున్నారా ?

గోపా : అవును నేను కజ్జాలకోరును. అక్కడ మేనేజరు, బంట్రోతు, ఇక్కడ పెళ్ళాంబిడ్డలు అంతా నన్ను నేవాళ్ళే.

విద్య : మిమ్మల్ని ఎందుకంటారు. ఏం తప్పు చేశారని.

గోపా : ఎవళ్ళ తప్పుచేసినా నా మీదికే తోపేస్తున్నారు, పొద్దున వంట ఆలస్యం చేశావు. ఆఫీసుకు ఆలస్యం అయింది.

విద్య : వంటకాలేదని నామీద కోపగించి అన్నంమీద ద్వేషంతో వెళ్ళి పోయారు. అన్నద్వేషం సర్వనాశనం అయింది.

గోపా : వెధవశాస్త్రాలు నువ్వూనూ, యీసామెత పొద్దున తెలియలేదూ ?

విద్య : బియ్యంలేందే నేనేం చెయ్యను?

గోపా : అబ్బాయిని పంపించావుగా.

విద్య : వాడెళ్ళి అక్కడ స్టోర్సువద్ద క్యూలో కూర్చుండేటప్పటికి ఆల స్యంఅయింది. అంత తొందరయితే మీరే తెచ్చుకోలేకపోయారా? ఇంటిసంగతి సుతరామూ పట్టదు. మేం ఎంత హతమారిపోయినా చీమకుట్టినట్టు లేదు.

గోపా : ఏమీ చూడకుండానే నడుస్తుంది సంసారం. ఒళ్ళంతా రెక్కలు ముక్కలయ్యేటట్టు ఆఫీసులో చచ్చేది ఎవరికోసం ?

విద్య : పరేలెండి ఇప్పుడదీ మందపెట్టి వచ్చారుగా.

గోపా : నీలాంటి శనిదేవతతో మందపెట్టక ఏంచేస్తా?

విద్యా : అవును శనిదేవతను. దీన్ని వదల్చుకుని మరొక అదృష్ట దేవతను కట్టుకోండి.

గోపా : మాట్లాడితే ఇదొక్కటి తెలుసు ఎదురుచెప్పటం.

విద్యా : నా కెందుకు, నోరుమూసుకుని ఊరుకుంటానులెండి. మీ బాధలు మీరు పడండి.

గోపా : నీతో బాధగాక సుఖంగా ఏడ్చింది !

విద్యా : ఎవరితప్పులు వాళ్ళకు తెలియవు.

గోపా : బాగాతెలుసు ఎదట వాణ్ణి మాటలతో పొడుచుకుని తినటం, ఆఫీసునుంచి అవస్తపడి వచ్చాడు అని ఓదార్చటం, కొంచెంసేపు పేద దీర్చడంలేదు. కొరకంచువాటం. అసలు నువ్వేకాదు. మీ వంశమే అంత. చెట్టుకొద్దీ విత్తనం. అలాంటి కర్కోటకుల కడుపున కర్కోటకురాలు పుట్టక—

విద్యా : నన్నంటే అనండి. మావాళ్ళని అంటేమాత్రం వూరుకోను. ఎవరికుళ్లు వాళ్ళకి తెలియకపోతే సరి. మరొక అదదమైతే.

గోపా : నేనుగనుక నీతో యిలా గడుపుకుని వస్తున్నాను. ఇంకోడైతే కృష్ణలో దూకును.

విద్యా : మీరు దూకటం ఎందుకు ! నన్ను పిల్లల్ని ముంచి మీరు నచ్చిన దాన్ని కట్టుకుని ఊరేగండి.

గోపా : అంతా నీలాగే ! వెంకటచలంగారి భార్యచూడు ?

విద్యా : రౌతుకొద్దీ గుర్రం. ఆయన మీలాగే అనుకున్నారు. సంసారదాణా సంవత్సరానికి సరిపడా అన్నీ తీసుకొచ్చి పారేస్తారు. మనలాగ జుట్టుదగ్గరనుంచి ఎరువులేదు.

గోపా : ఆ లంచాలు తీస్తె ఎన్నైనా పారెయ్యొచ్చు. ఇంతకీ ఇల్లాలు చక్కదిద్దుకోవటంలో వుంటుంటుంది.

విద్యా : మహాబాగా చక్కదిద్దుతుంది. ఆవిడ చేసే హంగామాకి ఆయన కాబట్టి వేగుతున్నాడు. ఆయనకున్న ఓర్పు వినయం చనువు...

గోపా : నువ్వక్కడికి వెళ్ళి కాపరంచెయ్యి తీరిపోతుంది.

విద్యా : ఛీ సిగ్గులేని మాటలు నోటికెంతొస్తె అంత అనడమే!

[గిరిజ తిరిగి వెళ్ళిపోతుంది. గోపాలం క్రొసువర్డ్సు పజిలు చూస్తూవుంటాడు]

సుడిగాలి వీచెను పడవ తడబడియెను
గడయేసి చుక్కాని గడుసుగా త్రిప్పుకో
నడియేటిలో నావ వడివడిగ పోతూంది
కాచుకో తెలివిగా గట్టుమెట్లే నేను
ఒరిసిపడు అలలలో ఒరిగి ఊగిసలాడు
ఒడుపుగా నడుపుకొని ఒడ్డు పట్టించుకో.

అబ్బాయి : అమ్మా నాకు బడికి వేళయిపోతుంది. వెళ్ళిపోతాను.

విద్యా : వడ్డించేస్తున్నాను: ఉండు.

అబ్బాయి : అక్కరలేదు ఆలశ్యం అయిపోతుంది వెళ్ళిపోతాను,

విద్యా : వెళ్ళితే వెళ్లు, అన్నంమీద కోపగించి ఎవరిని ఉద్ధరిస్తారు. పోండి.

అబ్బాయి : సరే పోతాను.

గోపా : ఏమిటీ వెధవగోల. కాస్సేపు స్థిమితంగా ఆలోచించుకోవాలంటే ఆలోచించుకో నివ్వరు గదా.

అబ్బాయి : అమ్మా నా హిందీపుస్తకానికి రూపాయి కావాలి.

విద్యా . రూపాయలు మూలుగుతున్నై. అస్తమానం పుస్తకాలే

అబ్బా : జీతం యివ్వనేలేదు. పుస్తకాలయినా కొనుక్కోవీ. ఒక్కరూపాయేకాదూ.

విద్యా : యిక్కడేం రూపాయలు చెట్టులేదు. రేపటినుంచి ఆ వుద్యోగం కూడా వదిలిందా అబ్బాయిపనీ వాళ్ల నాన్నగారిపని తెలియాలి,

గోపా : పాడుగోల మానరుగదా.

విద్యా : మాది పొడుగోలగానే వుంటుంది.

అబ్బాయి : అమ్మా అమ్మా (సిరాబుడ్డి వదిలేస్తాడు)

విద్యా : యిక్కడ సిరాబుడ్డి తగలపెట్టావు. అన్నీ యిలాంటి పనులే. ఎక్కడా జాగ్రత లేదు (కొడ్తుంది.)

[అబ్బాయి బిగ్గరగా ఏడుస్తాడు.]

గోపా : నామీద కోపంచేత వాణ్ణి కొడతావెందుకు? ఊరుకున్నకొద్దీ మరీ హెచ్చిపోయింది. డొక్క చీల్చి వేస్తాను, ఏమనుకున్నావో ఊరుకుంటుంటే సరి.

విద్యా : ఆ ఊరుకుంటే సరి.

[కోపంతో గొంతుపట్టుకుని] చావు, చావు!



# తీరని కోరికలు

## ఎనిమిదవ రంగము.

[ మళ్ళీ తెర లేచేటప్పటికి గోపాలం మంచంమీద మలేరియా రోగిలాగ పడుకుని ఉంటాడు. అతని చేతులతో సుబ్బలక్ష్మి గొంతు పిసుకుతూ వున్నట్లు — మొదటి రంగంలో లాగే. ]

గోపా: (వెర్రికేకలేస్తూ) చావు! చావు!

సుబ్బ: ఏమిటండీ ఆ కేకలు—నేను, నేను.

గోపా: ఎవరది?

సుబ్బ: ఇంకెవరు నేనే నండి—

గోపా: నువ్వా సుబ్బూ, ఆ విద్యుల్లత, మేనేజరు, గురవులు.

సుబ్బ: ఎవ్వరూలేరు. ఎవరూ, డాక్టరుగారా!

గోపా: ఇదంతా కలంటావా, ఇంత పెద్దకలే.

సుబ్బ: పదకొండు గంటలకి నిద్రపోయి ఇప్పుడు లేచారు. ఎనిమిది కావచ్చింది.

గోపా. అబ్బా! అంత సేపు నిద్రపోయానా వెలుగువచ్చిన తర్వాత లేవ లేకపోయావూ.

సుబ్బ: జ్వరంమీద నిద్ర పట్టిందిగదా మీరే లేస్తారని లేపలేదు. రాత్రి ఎంత భయం వేసిందనుకున్నారూ, ఎంత జ్వరం! ఎన్ని వరాకు మాటలు — చాల కంగారుపడ్డాం — ఆ డాక్టరుగారు,

గోపా: ఆయ నెప్పుడొస్తారు?

సుబ్బ: అదిగో మాటలోనే వచ్చారు.

గోపా : Good morning Doctor.

డాక్టరు : రాత్రి బాగా నిద్రపట్టిందా?

సుబ్బలక్ష్మి : బాగా నిద్రపట్టింది. అప్పటి నిద్ర యిప్పు లేచారు. Ice bag పెట్టగానే బారం దిగిపోయింది. చెమటపట్టి నిద్రపోయారు.

గోపా : డాక్టర్ ఎంత పెద్దకల వచ్చిందనుకున్నావు.

డాక్టరు : వస్తుందిలే. మలేరియాలో అంత తీవ్రజ్వరం వచ్చింది గనుక Nervous System అంతా affect చేస్తుంది. అమ్మా వేడి నీళ్లు తెస్తారా ఇప్పుడు ఒక ఇంజక్షన్ యిస్తే.

గోపా : Brain కూడా affect చేస్తుంది.

డాక్టరు : Brain కే ఎక్కువ దానితో తల దిమ్మెత్తి Balance తప్పి పోయి ఏదో ధోరణి మాటాలూ పేలాపనా....

గోపా : అవును మరి Balance తప్పితే ఏముంది పిచ్చెక్కినట్టె.

డాక్టరు : ఈ మాటలు నీ మెదడులో జరిగివున్న ఆలోచనలన్న మాట. బుద్ధి, వివేకం, వీటి ప్రభావంవల్ల పైకిరాకుండా వుంటాయి. ఇవి పెద్ద జంతుశాలలో పెట్టిన క్రూరమృగాలవంటివి. ఒక్కసారి కట్లు తెంపుకోగానే అడవిజంతువుల్లాంటి ఆలోచనలు విచ్చలవిడిగా విహరిస్తయి. తిరిగి బుద్ధి పనిచెయ్యగానే వాటి బోను ల్లోకి అవి పోతాయి.

గోపా : అంతేనుమా ! మరి స్వప్నలోకంలో.

డాక్టరు : స్వప్నజగత్తు వీటికి స్వేచ్ఛా ప్రపంచం అన్నమాట. ఈ ఆలోచనలకు సరిపడ్డ సన్నివేశాలు ఏర్పరచు కుంటాయి, ఏవో చేస్తాయి. ఎన్నో అనుభవిస్తవి.

గోపా : అందుకే ఒకదానికీ ఒకదానికీ, సంబంధం వుండదు.

భాస్కరు : మనకు ప్రతివాళ్ళకు ఏవో కోరికలుంటాయి. ఈ తీరని కోరికలే స్వప్నలోకం నిర్మించుకుని ఒకవిధంగా తృప్తి పడతాయి.

గోపా : తీరనికోరికలు!

భాస్కరు : ఇంకా స్వప్నలోకంలోనే వున్నావు. దిగిరా, [ ఇంజక్షన్ యిస్తాడు. ]

కలవరింతలా సఖా
కలతనిదుర ఉలికిపడిన
కలిసిరాని అవకాశపు
కాలవిధపు గడవలేక.
తీరని కోరికల వెనుక
జారిన స్వప్నాల ముసుక
కోరిన సౌఖ్యాలదనుక
మారిన జీవితపు కినుక.



